# కేసరి రత్నత్రయము

## లోధ్ర

### గర్భాశయరోగనివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూల. బహిష్టు కాకుండుట, అకాలబహిష్టు, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మవ్యాధులను కుదుర్చును. లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదము, కల్పవృక్షము, కామధేనువు, కొంగు బంగారము, రత్నఖచిత యాభరణము, సర్వాభీష్ట ప్రదాయినియని వాడినవారు పలువిధములుగ స్తోత్రము చేయుచున్నారు.

12 ఔ. రు. 4-4-0 6 ఔ. రు. 2-4-0

## అమృత

### రక్తశుద్ధిద్రావకము

ఇది రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్లనొప్పులు, సోమరితనము, మేహస్రవణములు, సుఖసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సును యిచ్చును. ఈ మేలైన యౌషధమువలన నెందరో యారోగ్యవంతులైనారు.

12 ఔ. రు. 4-4-0 6 ఔ. రు. 2-4-0

## అర్క

### సర్వజ్వరనివారిణి

ఆహార, విహార ఋతుభేద దోషంబులవలన అన్నాశయమునందు క్రిమికూటము చేరి పలువిధములైన జ్వరములు సంభవించుచున్నవి. వాతజ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము, సన్నిపాతజ్వరము, మరి యితర విషమజ్వరములను, కడుపులో ప్లీహమను జ్వరగడ్డను కుదుర్చును. ఈ ఔషధమును పసిబిడ్డలకుగూడ యివ్వవచ్చును.

1 ఔన్సు బుడ్డి రూ. 1-2-0

తపాలా ఖర్చులు ప్రత్యేకము

## కేసరికుటీరం లిమిటెడ్

ఆయుర్వేద ఔషధశాల

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14.

తెనుగుజిల్లాలకు, నైజామునకు, ఏజంట్లు :

సీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయాధికము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందియవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన ఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక

వ్యవస్థాపకులు

డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౨౨] నవంబరు 1953 [సంచిక ౧౧



# విషయసూచిక



ఆనందపారవశ్యంలో




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



## ప్రపంచములో శాంతి స్థాపనకు అవకాశములు

ఇంతకుముందు శాంతి స్థాపనయొక్క ఆవశ్యకతను ప్రపంచము గుర్తించినా గుర్తించక పోయినా రెండవప్రపంచ యుద్ధానంతరము ప్రజలకు శాంతి స్థాపనయడల ఆసక్తి పెరిగింది. తమ పురోభివృద్ధికి శాంతి అత్యంత అవసరమని గుర్తించబడింది. కాని శాంతి స్థాపన కార్య కలాపాలు నిర్విఘ్నంగా సాగాలంటే అగ్రరాజ్యాలు, చిన్న రాజ్యాలు ఏకోన్ముఖంగా ప్రజలసహకార సద్భావాలతో వాటిని నిర్వహించాలి.

శాంతిస్థాపన కార్యక్రమంలో జాతి, కుల, మత, వర్గరహిత సంఘ నిర్మాణ మునకు మొదట కృషి జరుగాలి. ఆ కృషి ఫలితంగా సుహృద్భావము, ఐకమత్యము, విశాలమైన భావములు ప్రపంచమందలి ప్రజలలో పెంపొందగలవు. తర్వాత పేద, ధనవంతునికిగల అఘాతమైన తారతమ్యము క్రమంగా సమసిపోయి ఒకరిపై నొకరి ఆధిక్యత, అధికారవాంఛలు ప్రాధాన్యము వహించక, అవకాశములు, హక్కులు,

బాధ్యతలు సమరసభావంతో పంచుకొనుట జరిగిననాడు శాంతికి కొరత యుండదు. మానవుడు తన పరిశోధన, కృషిఫలితంగా ఆర్జించిన అనుభవ విశేషాలను తోడి ప్రజానీకపు అభివృద్ధికి వినియోగించుటకు ఆటంకాలుండవు. యుద్ధాల ప్రసక్తికాని, వైషమ్యాలకు అవకాశము కాని అంతగానుండదు.

ఆర్థికరంగంలో సయితము మానవుడు బాధ్యతాయుతంగా కృషిచేసి తన యొక్క, తన కుటుంబంయొక్క అవసరాలు తీర్చుకుంటూ నలుగురిలో గౌరవంగా తిరుగకలిగిననాడు ఆకలిదప్పుల ఆర్తానాదాలు, అనారోగ్యం మొదలగులోట్లకు అవకాశ ముండదు. ఆయాదేశాలలో ప్రజలు, ప్రభుత్వములు పరస్పరసహకార సద్భావములతో సుస్థిరమైన శాంతిని కాంక్షించినచో ప్రపంచమొత్తంలో అభ్యుదయ పరంపరలకు లోటు యుండదు.

ఉత్పత్తి పారిశ్రామిక రంగాలలో సయితము మానవావసరాలను తీర్చడమును ప్రధానముగా నెంచి పోటాపోటీలకు, వర్తకవ్యాపారాలలో ఆధిక్యతకు ప్రాకులాడుట మానడం సయితము శాంతి స్థాపనకు విశేషముగా దోహద మివ్వగలదు.

శాంతి స్థాపనకు జరుగవలసిన కృషి గురుతరమైన దనునది వివాదరహితమయిన విషయం. కృషి ఫలవంతం కావాలంటే ప్రపంచములోని ప్రతియొక్క దేశము, అందు లోని ప్రజలు శాంతిస్థాపనయొక్క ఉద్దేశాలను, దానికవసరమయిన విశాలభావాలను వ్యాప్తిచేయుటకు అవసరమయిన విద్య, విజ్ఞానములను పెంపొందింప చేసికోవాలి. ఆ నాడుకాని సుస్థిరమైన శాంతికి నిలయమై ప్రపంచము, ప్రజలుకూడ సుఖించరు. ఈ కార్యక్రమాన్ని పురుషులకంటె స్త్రీలు సంఘంలో చొరవగా నిర్వహించడానికి అవకాశములుమెండు. మహిళలకు గల ఓర్పు, తీరిక, సమరసదృష్టి పురుషులకు తక్కువ. సంఘంలో శాంతిస్థాపనా కార్యకలాపాల వ్యాప్తికి, తద్వారా ఆయాదేశాలలోను, ప్రపంచము మొత్తముమీద శాంతి స్థాపనకు మహిళామణులు విశేషంగా కృషి చెయ్యడంవలన ప్రపంచకల్యాణానికి ఎంతైనా తోడ్పడిన వారగుదురు.






'నారపీచు'

అక్టోబరు నెల 13వ తేదిన ఉదయం చెన్నపురి లోని సేవాసదనం రజతోత్సవము ప్రముఖుల ప్రశంసల మధ్యన శ్రీమతి కృష్ణహతీసింగ్ గారిచే ప్రారంభించబడింది.

మద్రాసు సేవాసదనం యొక్క అపూర్వసేవను కొనియాడుచూ సంఘసేవ — ముఖ్యంగా స్త్రీ, శిశు సేవ, మన ఆర్థిక సమస్యల పరిష్కారమునకు కీలకమని శ్రీమతి హతీసింగ్ గారు ప్రారంభోపన్యాసములో చెప్పుచూ, అజ్ఞాన దారిద్ర్యాలను చైతన్య నిలయమయిన సేవాసదనంవలె కూకటి వేళ్లతో తొలగించిననేకాని స్వాతంత్ర్య సిద్ధికి ముందు ప్రజలకుచేసిన వాగ్దానాలమలుజరుగుటకాని, ఆర్థికసమస్యల పరిష్కారంగాని జరుగ నేరదన్నారు.

ఈ మాటలు సంఘసేవలోను, సంఘపునర్నిర్మాణంలోను స్త్రీలకు, శిశువులకు గల ప్రాముఖ్యాన్ని ప్రతిఫలింప చేస్తున్నవి. సుశిక్షణతో కూడిన విద్య, విజ్ఞానములు స్త్రీలకున్ననేకాని దేశానికి, సంఘానికి ఆధారభూతులయిన యీ నాటి శిశువులు భవిష్యత్తులో పోషించబడి, పెరిగి పెద్దవారలై మహత్కార్యాలు చేయుడంకాని, ఉత్తమలక్ష్యాల సాధించుటకాని జరుగదు.

సంఘంలోని దురాచారాలు, అవినీతి, మూఢ నమ్మకాలు మొదలగువానికి చాలవరకు ప్రజలలోని అజ్ఞానమే కారణం. ముఖ్యంగా సంఘంలో ప్రముఖ పాత్రవహించవలసినది స్త్రీ. అట్టిస్త్రీకి విద్యావిజ్ఞానాలు లోపిస్తే ఆ సంఘం ఏ నాటికి బాగుపడదు. శిశువుల పోషణకాని, శిక్షణకాని తృప్తికరంగా నుండదు. కుటుంబములోని ఆర్థికవ్యవస్థ నర్థముచేసికొనలేని స్త్రీమూలంగా కుటుంబానికి - తద్వారా సంఘానికి మేలుకంటె కీడే అధికముగనుండగలదు. ఈ పరిస్థితులలో సంఘపురోభివృద్ధికి స్త్రీలకు విద్య, విజ్ఞానాలతో కూడిన సుశిక్షణములు చాలతోడ్పడగలదు.

మద్రాసు సేవాసదనం మహిళలకు విద్యాబుద్ధులు గరపి అజ్ఞానాన్ని పారదోలింది; వృత్తి విద్యలను నేర్పి జీవనోపాధికి మార్గములు కల్పించింది; నిరాశ, నిస్పృహలకులోనైన అనేకమంది అనాథలకు ఆశ్రయమిచ్చి సుశిక్షణ, విద్యావిజ్ఞానముల గరపి నలుగురిలో గౌరవంగా జీవయాత్ర చేయుటకు తోడ్పడింది. ఈ విధంగా మహిళా జనోద్ధరణకు పురోభివృద్ధికి కృషిచేయుచున్న సేవాసదనం కలకాలం వర్ధిల్లాలి! అంతేకాదు అట్టి సంస్థలు విరివిగా ఏర్పడి సంఘపునర్నిర్మాణమునకు తోడ్పడాలి.

◆ ◆ ◆

శ్రీమతి కృష్ణహతీసింగ్ గారి అధ్యక్షతన శిశు సంక్షేమ కమిటీ తన కృషిని మద్రాసులో ప్రారంభించింది. సభ్యులు శ్రీమతి మంజుభాషిణి, శ్రీమతి అమీద్ ఖాన్, శ్రీన్యాపతి రాఘవరావు, డా. బి. హెచ్. మెహతా గారలు. ఈ సందర్భమున అధ్యక్షురాలు బొంబాయిలోకంటె మద్రాసు రాష్ట్రంలో శిశు సంక్షేమ కార్యకలాపాలు చురుకుగా సాగుతున్నవని వెల్లడించారు.

శిశుసంక్షేమ కమిటీ తమ కార్యకలాపాలను బాలల ఆరోగ్య సౌభాగ్యాలను, విద్యావిజ్ఞానాలను వ్యాప్తి నొందించడానికని ఉద్దేశించింది. శిశు సంక్షేమ కార్య కలాపాలు ప్రజలసహాయ సహకార సానుభూతులతో జయప్రదంకావాలి.

◆ ◆ ◆

ఏటేటా అనేకకష్టనష్టాలను కలిగిస్తున్న వరదల నుండి దేశంలోని వివిధప్రాంత్య ప్రజానీకాన్ని రక్షించుటకుగాను ఇంజనీర్ల సంఘాన్ని నియమించాలనియు, వరదలనుండి దేశాన్ని రక్షించుట ఇంజనీర్లకర్తవ్యమని ఇండియాప్రధానమంత్రి పండిత నెహ్రూ కేంద్ర ఇరిగేషన్, విద్యుచ్ఛక్తి బోర్డు 24వ వార్షికోత్సవ ప్రారంభోపన్యాసములో ఉద్బోధించారు.

ఈ మధ్య గోదావరి వరదల భయానక దృశ్యాలు, విషాదఫలితాలు చూచిన తరువాత యిట్టి ఇంజనీర్ల సంఘం ఆవశ్యకతను ప్రజలు గుర్తించకలుగడం సులభం. ప్రజలశ్రేయస్సును దృష్టిలోనుంచుకొని ఇంజనీర్లు తమ ఆధునిక విజ్ఞానసంపదను దేశపురోభివృద్ధికి అంకితము చేయాలి. అట్టి ప్రయత్నపూర్వకమైన కృషికి ప్రజలు సయితం విరివిగా సహాయపడాలి.



# దీపావళి దివ్యజ్యోతుల్లో

బసవరాజు రాజ్యలక్ష్మమ్మ

ఆళ్వారుపేట బస్సుస్టాపింగు దగ్గరగా నున్న మఱ్రిచెట్టుకింద కూర్చుని మునుసామి పాతచెప్పులు కుట్టుతూవుండేవాడు.

మునుసామి కూతురు తాయారు తొమ్మిదేళ్ళపిల్ల తండ్రి దగ్గరగా కూర్చుని కుట్టుసామానులు అందిస్తూవుండేది. తాయారు నిజంగా మాదిగకులంలో పుట్ట వలసిన పిల్లగాదు. యేదో శాపంవల్ల మాదిగకులంలో పుట్టిందనే నా నమ్మకం. తెల్లజామపండువంటి ఆ ఛాయా, ఆ చక్కని గుండ్రని ముఖము, చెంపకు చారెడుకళ్ళు, నల్లని వుంగరాలు, తిరిగిన జుట్టూ, ముద్దులు మూటగట్టినట్టుగా వుండేది, ఆ జుట్టుకు తైలసంస్కారము లేకపోయినాగూడాను.

భాగ్యవంతుల పిల్లల మాదిరిగా శుభ్రమైన గుడ్డలు, కడుపునిండాతిండీ, రోజూ స్నానము, తలదువ్వుకోనివుంటే యింకా ఎంత చక్కగా వుండేదో అనుకునేదాన్ని. తాయారులో ఒక విధమైన ఆకర్షణశక్తి వున్నది.

నేను మొదటిసారి ఆళ్వారుపేట వెళ్ళినప్పుడు మళ్ళా తిరిగి వచ్చేటందుకు బస్సులు ఖాళీగా లేకపోవటంవల్ల ఆ మఱ్రి చెట్టుదగ్గర చాలాసేపు నించోవలసివచ్చినది. అప్పటినుండి నాకూ తాయారుకు బాగా స్నేహం కుదిరిపోయింది. నేను వెళ్ళినప్పుడల్లా ఆ తాయారుకు తినటానికి యేదైనాపెట్టి మాట్లాడించకుండా అడుగు అవతలకు పడేదేకాదు నాకు, అప్పటినుండి తాయారు నేను బస్సు దిగుతుండగానే చూచి నాదగ్గరకు పరుగెత్తుకుని వచ్చేది.

మునుసామి మాదిగకులంలో పుట్టినా మంచి స్వభావంగలవాడు, అమాయకుడు. నందనారుపాటలు పాడుకుంటూ పాత చెప్పులు కుట్టుకునేవాడు.పోయిన సంవత్సరం దీపావళిరోజునే తాయారు తల్లి కలరావచ్చి చచ్చిపోయిందనీ, ఈ పిల్లకోసమే తను మళ్ళా పెళ్ళిచేసుకోలేదని చెప్పేడు. తల్లి లేనిపిల్లని తల్లితండ్రీకూడా, తనే అనుకుని తాయారును అతి ప్రేమగా తన ప్రాణం కంటెగూడా ప్రేమగా చూచేవాడు. అయితే బీదవారికి ప్రేమవుంటే మాత్రం యేమిపెట్టగలరు? మునుసామికీ! తాయారుకుకూడా ఆకలితో మూరెడు లోతుకు పోయిన పొట్టలే, బొమికలు బయటపడ్డ శరీరాలే.

ఏమహానుభావులైనా అణాడబ్బులిచ్చి చెప్పులు కుట్టించుకుంటేనే వారికితిండి, లేక పోతే ఆ రోజపస్తే వాళ్ళకుపాపం. నాకూ

తాయారుకు బాగా దోస్తీ అయిపోయింది. నాకు బస్సు అందనపుడల్లా, మళ్ళా బస్సు వచ్చేవరకు తాయారుచేత చిన్ని చిన్ని పాటలు పాడించటం, ఆ ముద్దు మాటలు వినటం, నాకు తోచింది. తినటానికి కొని పెట్టటం మామూలు అయిపోయింది.

ఒక రోజు మునుసామితో ''మునుసామీ మీ తాయారును నాకిస్తావా? మా శారదాని కేతనంలో చదివిస్తాను; పిల్ల కడుపు నిండా తిండి తిని బాగుపడుతుంది, చదువు కుంటుంది అన్నాను. ''

మునుసామి జాలిగా ''అమ్మా నేను అసలు బ్రతకటం ఈ తాయారుకొరకే నమ్మా. నా తాయారు నాదగ్గర లేనిది ప్రపంచమంతాకూడా అంధకారంగా కనపడుతుంది'' అన్నాడు.

బీదవారికి భాగ్యవంతులకు కూడా ప్రేమా, కడుపుతీపి ఒకటేగదా అనుకున్నాను. అయితే భాగ్యవంతులు తమ పిల్లలకు పెట్టినట్లు బీదవారు తమ పిల్లలకు కోరినతిండి, కోరినబట్టా యివ్వలేక పోవచ్చును.

మునుసామితో నేను మళ్ళా ఆ ప్రశంశ తేలేదు. నేను దీపావళి రేపనగా ఆళ్వారుపేట వెళ్ళేను. అప్పటికి నేను ఆళ్వారుపేట వెళ్ళి వారంరోజులైనది, నేను బస్సుదిగగానే పరుగెత్తుకునివచ్చే తాయారు ఆ రోజురాకుండా తండ్రిఒళ్లోపడుకుని యేడుస్తున్నది. మునుసామికూడా కళ్లు గుంటలు పట్టి నీరసంగా వున్నాడు. తాయారు దగ్గరకువెళ్లి పలహారం చేతికిచ్చి'' తాయారూ! యెందుకేడుస్తున్నావమ్మా'' అని అడిగేను.

మునుసామి ''అమ్మా యేమని చెప్పను మాకిది కొత్తగాదుగానీ మూడురోజులైనది తాయారు నేనూ గంజినీళ్లుకూడా తాగలేదు. మూడురోజులనుంచి ఒక అణా డబ్బులైనారాలేదు. పిల్లప్రాణం, నాప్రాణం కూడా శోషకొస్తున్నది-యేమిచెప్పమంటారమ్మా, మా అవస్థ! స్వరాజ్యం వచ్చిందంటారు; యేమికాంగ్రెసోనమ్మా, మా బీదవారి అతిగతీ కనుక్కునే వారుండరు. రేపు దీపావళిపండుగ; నా భార్యపేరుచెప్పి యేదైనాచేద్దామన్నా పూటకి గంజి నీళ్ళకే గతిలేనివాణ్ణి యేంచెయ్యను? భాగ్యవంతులకు రోజూ పండగే. ఈ తల్లిలేని పిల్లకు కొత్త బట్టలు, టపాకాయలు యివ్వలేను సరిగదా తిండి అయినా పెట్టలేను గదా. నేనుగూడా దాని తల్లితోపాటే పోయినట్టయితే మీబోటివారైనా పెంచే వారు'' అనివాపోయినాడు. నా గుండె కరిగిపోయింది. ప్రపంచంలో తిండిలేక బీదవారు యిల్లా యెంతమంది బాధపడుతున్నారో గదా! భాగ్యవంతులు కోరిన తిండి, కోరినబట్టలు, మేడమీదకాలు కింద పెట్టకుండా కార్లల్లో, తిరుగుతుంటే బీద

వారికి గంజినీళ్ళకైనా గతిలేకుండావున్నది మనదేశంయొక్క దుర్దశ. దేశమంతా కూడా ఈ దీపావళికి తలంట్లుపోసుకుని కొత్త బట్టలు కట్టుకుని నవకాయపిండివంటలతో భోజనంచేసి టపాకాయలు కాల్చుకుంటుంటే ఈ మునుస్వామి, తాయారు యింకా యిల్లాంటివారు యెందరో పస్తుపడుకోటమా! భగవంతుడికి న్యాయాన్యాయాలు లేవు. ఒకమూల బొజ్జలునిండిన మార్వాడీ సేట్లు రూపాయలకు పూజలు చేస్తుంటే వేరొక మూల బీదవారు తిండికిలేక పస్తుపడుకోటమా? నాగుండె తరుక్కుపోయింది. అక్కడే దగ్గరవున్న హోటలులో తినటానికి పులుసన్నం పొట్లాలుకొని మునుసామికి, తాయారికిచ్చి తినమన్నాను. మునుసామి, తాయారు ఆకాస్త పులుసన్నం తిని నీళ్లు తాగేటప్పటికి ప్రాణంకాస్త తెప్పరిల్లుకున్నది పాపం. మునుసామి "నా ప్రాణానికేమిగాని అమ్మా, నా తాయారు ప్రాణం కాపాడేరమ్మా" అన్నాడు జాలిగా.

"రేపు పండగ-మీరు యింకేమీ పెట్టి పుట్టలేదు, కడుపునిండా గంజి అయినా తాగండి" అని చెప్పి అప్పటికి నాదగ్గరవున్న దేదో మునుసామి చేతిలోపెట్టి తాయారుతో "నేడో రేపో నీకొరకు గౌనూ, టపాకాయలు తెస్తాన"ని చెప్పి వెళ్లాను. దీపావళి రేపన గానే మబ్బు వర్షం ప్రారంభమైనది. దీపావళి పండగరోజు యెనిమిదిగంటలకల్లా తాయారుకొరకు ఒక గౌను టపాసులు, కొన్ని తినేవస్తువులు తీసుకుని తాయారును సంతోషపెట్టుటకు వర్షాన్ని కూడా లెఖ్ఖ చెయ్యకుండా ఆళ్వారుపేట వెళ్లాను. కాని ఆ చెట్టుదగ్గర మునుసామి గాని తాయారుగాని కనపడలేదు, ఆదుర్దాతో అక్కడవున్న కిళ్లీషాపు నాయరును అడిగాను "తాయారు మునుసామి యింకారాలేదా!" అని

నాయరు "అమ్మా నిన్న రాత్రి యేడు గంటలప్పుడు మునుస్వామి తాయారు తేనాంపేటలో వున్న వారి గుడిశకు పోతూ వుండగా ప్రమాదవశమున ఒక జమీందారు గారి కారుట తాయారుమీదుగా పోయింది. తాయారు బ్రతికే స్థితిలో లేదు. వెంటనే జనరల్ ఆస్పత్రికి తీసుకుని వెళ్లారు. ఈపాటికి పోయేవుంటుంది" అని చెప్పేడు. నెత్తిన పిడుగుపడ్డట్టయినది ఆ మాట వినగానే. ఈ భాగ్యవంతులు కన్నుమిన్ను తెలియకుండా తిరుగుటగాక బీదవారిని బ్రతకనివ్వరు కూడా గాభోలు భగవంతుడా! అనుకుని వెంటనే బస్సుయెక్కి ఆస్పత్రికి వెళ్లేను.

తాయారు యేవార్డులోవున్నదీ యెవరు చెపుతారు? పేరు ప్రఖ్యాతులు జెందినదని చెపుతారా, వక ధనం వంతురాలని చెపుతారా! కొంతమంది నర్సులు నామాటే వినుపించుకోలేదు. నిన్న కారుకిందపడ్డ

అమ్మాయి యేవార్డులో వున్నదని అందరినీ అడిగాను. అందులో స్త్రీహృదయం గలిగిన ఒక నర్సు మాత్రం నన్ను తాయారు దగ్గరకు తీసుకొని వెళ్లినది. తాయారు కొన వూపిరితో అంతిమయాత్రకు సిద్ధంగా నున్నది. మునుసామి దగ్గర కూర్చుని గోల పెడుతున్నాడు. నన్నుచూడగానే "అమ్మా నీతాయారు యింక నాకు దక్కదు. ఏదో శాపంవల్ల ఆ దేవలోకంలోనించి దిగి నా యింట్లో పుట్టింది - లేకపోతే అల్లాంటి పిల్ల నాయింట్లోపుట్టుటయేమిటి! నాకెల్లా దక్కుతుంది "అని యేడ్చేడు.

తాయారు చివరసారి కళ్ళు తెరిచి చూచింది. నా కొరకా ప్రాణం యింతవరకు నిల్చివున్నదన్నట్టుగాచూచి ప్రాణం వదిలింది. ఆ దృశ్యం ఎంతకఠినగుండెగల వాళ్లనుకూడా కరిగించకమానదు. అసలు ఈ తాయారు యెవరు? నేనెవర్ని? మూడు నెలల స్నేహంలో మా యిద్దరికి యింత ప్రేమ బంధం యేర్పడటం యేమిటి? లోకంలో యెంతమంది పిల్లలులేరు! యెంత మంది చచ్చిపోవటంలేదు! ఈ తాయారు చచ్చిపోతేనాకింత విచారమెందుకుండాలి? మా యిద్దరికీ యేదో పూర్వజన్మ సంబంధం తప్పక వుండియుటుందనే నా నమ్మకం. నర్సులు ప్రాణిపోగానే మంచంమీదనుంచి తాయారుని తియ్యమని, లేకపోతే తామే తీసేస్తామని గోలచేస్తున్నారు. నేను ఆ దృశ్యంచూడలేక వచ్చేశాను. మునుసామి పాపం 'నిరుడు దీపావళి తాయారు తల్లిని పొట్టన బెట్టుకుపోయింది. ఈ సంవత్సరం దీపావళి నా తాయారుని పొట్టన పెట్టుకుపోయింది' అని యేడుస్తున్నాడు. దీపావళి పండగ తాయారుమీదుగా పోయిందిగాబోలు. పాపం దీపావళి ప్రజల నందరినీ సంతోషపెట్టినా మునుసామిని మాత్రం యేడ్పించి పోయింది.

—— (o) ——

"మార్పు" — ప్రశంస

అక్టోబరు మాసపు గృహలక్ష్మిలో శ్రీ వై. వి. శర్మగారు వ్రాసిన "మార్పు" అన్న కథానికలోని ప్రత్యేక విశిష్టత ఏమంటే, తాత్కాలిక యావ్వనోద్రేకాలకులోనైన యొక అభాగిని జీవితం, చివరకు విషాదాంతంగా ఎలా పరిణమించిందో అన్న చిత్రణ, నిరూపించుటమే. సమాజంలోని సమస్యనొకదానిని కథావస్తువుగా గ్రహించి, రచించిన "మార్పు" వంటి కథానికలు మీ "గృహలక్ష్మి"కొక ప్రత్యేక అలంకరణ అని భావిస్తున్నాను.

రాచూరి లక్ష్మీనరసింహారావు



# రేడియో

## గృహ నిర్వహణము – అతిథి సత్కారము

శ్రీమతి వేదవల్లి తాయారమ్మ

"గృహిణీ గృహముచ్యతే" అంటారు పెద్దలు. గృహిణికి గృహానికి అవినాభావ సంబంధమున్నది. ఇల్లుచూచి యిల్లాలిని చూడమన్నారు. ఇల్లు చూడగానే యింటి యిల్లా లెటువంటిదో తెలిసిపోతుంది. సంపాదన మాత్రమే యజమానివంతుగాని; ఆ ధనము దేనికెంతెంత వినియోగించవలసినది గృహలక్ష్మి అభిప్రాయాన్ననుసరించే ఉంటుంది. ఆమె కిష్టములేకపోతే యజమాని యెంతగట్టివాడైనా యేమీచేయలేడు. సామాన్యంగా స్త్రీలు తమ కిష్టములేని సందర్భాన్ని భర్తమీదికి త్రోసివేస్తారు. "ఏమోనమ్మా! మా వారి కిష్టములేనిపని నేను చేయను" అని తప్పించుకుంటారు. వారు పూర్తిగా తలిస్తే సామదాన భేదోపాయాలచేత భర్త మనసు మళ్లించి తమ కార్యం సానుకూలం చేసుకుంటారు. బిడ్డల సంరక్షణ అంతా తల్లిదే. "తల్లిని బోలినబిడ్డ నూలును బోలినగుడ్డ" అనునట్లు బిడ్డల అలవాట్లు, ఆచారాలు, తెలివితేటలు అన్నీ తల్లి పోలికలోనే తయారవుతవి.

నాలుగాశ్రమాలలోకి గృహస్థాశ్రమము చాలా శ్రేష్ఠమైనది. దీనివలన యిహ పరాలు రెండూ సాధించవచ్చు. గృహస్థాశ్రమ భారమంతా చాలవరకు భార్యమీదనే ఆధారపడియుంటుంది. వంట పని మొదలుకొని అతిథి సపర్యవరకు ఆమె చేయవలసినదే. ముఖ్యంగా గృహపారిశుద్ధ్యము శిశుపోషణ, భర్తృసేవ, బంధుసన్మానము, పరిచారికా శిక్షణ మొదలగు శాఖలన్నీ సక్రమంగా నడిపిననాడే గృహజీవితము సార్థకమవుతుంది. వీనిలో నేది కొరవడినా యేది సాధించలేకపోయినా "సంసారం సాగరం దుఃఖం" అనునట్లు జీవితము దుఃఖసాగరంగా తయారవుతుంది. కుంటి, గ్రుడ్డి, మూగ, ముసలి మొదలైన యవధ్యులు, పరివ్రాజకులు, క్షపణకులు, యోగులు, జోగులు, సాధువులు, సన్యాసులు, బైరాగులు మొదలగు వారి కందరికి గృహమేధి కల్పవృక్షము, కామధేనువు, చింతామణి తంగేటి జున్నులతో సమానుడని వర్ణించాడు ఆంధ్రకవితా పితామహుడు. సుఖజీవులైన గేస్తులు లేకుంటే అటువంటివారికాశ్రయమే లేదనవచ్చు. అనేక పుణ్యకార్యాలు చేయడానికి తగిన అవకాశాన్నిచ్చేదీ కుటుంబీకుని గృహావరణమే. అతిథి సత్కారాలు చేసిచేసి, తాము కాలు కదపకుండా కాశీయాత్రాది ఫలితాలను పొందుతారు.

దీని కంతకు అనుకూలవతి విజ్ఞానవతియైన భార్య సంప్రాప్తముకావాలి. అటువంటి కాంతారత్నం లభించిన గేస్తుని జీవితము బంగారు పంటలు పండిస్తుంది. "వండనలయదు వేవురువచ్చిరేని। అన్నపూర్ణకు నుద్దియానతని గృహిణి। అతిథులేతేర నడికిరేయైనబెట్టు" ప్రవరుని భార్యవంటి సోమిదమ్మలు తయారైననాడే గృహశోభ, దేశశోభ నిలబడుతుంది. ఇంటికెవరైనారాగానే ఉత్సాహంతో సత్కరించే గృహిణి అన్నపూర్ణాదేవి అనే చెప్పవచ్చును. అలసత్వము మందత్వము బద్ధకము పిశినిగొట్టుతనము ఉన్న యిల్లాలు పూర్వజన్మకర్మవల్ల దాపురిస్తే భవన భర్త

తెలివి తేటలన్నీ బూడిదలోపోసిన పన్నీరుతో సమా నము. ఎక్కువ ధన ధాన్యాదులు లేకపోయినప్పటికి "కార్యేషు మంత్రీ కరణేషు దాసీ" అనునట్లు నేర్పరి యగు గృహిణి తన శక్తి యుక్తులతో గృహమానంద సీమ చేయగలదు.

ఈ యతిథి సేవాధర్మమనేది మన హిందూమత సంప్రదాయానికి పట్టుగొమ్మ. ఒకప్పుడు మనదేశంలో సహపంక్తిని అతిథిలేకుండా భోజనము చేయగూడ దనే ఆచారముకూడా ఉండేది. అందుకొరకు ముందుగా సాధుసమాజములో నెవరినో యొకరి నాహ్వానించేవారు. అదిగాకుండా అభ్యాగతులను వారొకరున్నారు. అనాహూయంగా వచ్చేవారు. సరిగా భోజనాలవేళకు వచ్చినవారిని "అభ్యాగత స్స్వయం విష్ణుః" అని యా వ్యక్తిని కేవలము విష్ణు వుగా భావించి సత్కరిస్తారు. ఆతిథ్యానికి అన్న పానాలు ప్రధానము. "అన్నంబు ప్రాణరక్షణ మెన్నగ బ్రహ్మస్వరూపము" అన్నాడొక మహాకవి. అన్నము పరబ్రహ్మ స్వరూపము. నీరు నారాయణ స్వరూపము. అందువలన అన్ని దానాలలో అన్న దానము గొప్పదైనది. "అన్నదానాత్పరందానం। నభూతోన భవిష్యతి। నాఽత్ర పాత్ర పరీక్షాసా। నకాలనియమఃక్వచిత్" అని అన్నదానమునకు మించిన దానము లేదన్నారు. అందు వీడు అర్హుడా? అనర్హుడా? అను విచక్షణగాని, ఇప్పుడు చేయ దగునా? తగదా? అను కాలనియమముగానిలేదు. జాతిమత బేధము లెంత మాత్రము ఎంచకూడదు. "అతిథులే తేరనడికి రేయైనపెట్టు"నని పెద్దన్నగారు చెప్పుటలో కాలనియనుములేదనియేకదా! అన్నగత ప్రాణులను రక్షించుటకంటె విశేషధర్మ మేమీలేదు. అతిథిసేవా పరాయణుల పవిత్ర గృహములు దేవా లయములకంటె పునీతములు, సమస్త ప్రాణులను తనతో సమానముగా చూచుకోవలెనను గీతావాక్యము ఆతిథ్యమునకు పునాది. భోజన సత్కారమువల్ల సంతోషపెట్టినట్లు ఏసపర్యచేతను సంతోషపెట్టలేము. ఎంత గొప్పవారికైనా విందుభోజనాలతో లొంగొన వచ్చు. ఎల్ల జీవులకు ప్రాణధారక మైనది భోజనము.



ప్రేమ విలాసం

ఈ యతిథిపూజవలన సర్వభూత సమత్వమను మహాభాగవతలక్షణము సిద్ధించును. ఈ ధర్మము

నాచరించినవారికి సమస్త భూతములయందు భగవత్కళ యున్నదను జ్ఞానము స్థిరపడి సకల భూతాంతర్వర్తియగు పరమాత్మ సాక్షాత్కారముకూడ కలుగును. అతిథి సేవాఫలితమువలన సిద్ధించిన సర్వభూత సమత్వమువలన భగవంతునియడల పరాభక్తి స్థిరపడి మోక్షార్హతకలుగును.

ఈ పరమ సిద్ధాంతము నవలంబించి రంతిదేవుడు, సక్తుప్రస్థుడు మొదలగు మహనీయులు ఎన్నెన్నో కష్టముల నెదుర్కొని, తాము పూనిన అతిథిసేవా వ్రతమును వీడక సఫలీకృత మనోరథులై తరించినారు. సక్తుప్రస్థుడను గృహమేధి అతిథులకు కాళ్లు కడిగిన నీటిలో మునిగిన యొక ముంగిసకు సగము శరీరము మాత్రమే తడిసి అంత మట్టుకు నది బంగారుమయమైన దని మహాభారతములో నొక యైతిహ్యము. అతిథి సేవలో నెట్టి మహిమయున్నదో యీ కథవలన తెలియుచున్నది. గృహస్థులు తరించుటకింతకంటె సులభమార్గములేదు. అతిథి యెటువంటి కోరిక కోరినను, తీర్చినందున దోషములేదనికూడా చెబుతారు.

మన హిందువులకేగాదు, క్రైస్తవులు మొదలగు నితరమతములవారికిగూడ నీయంశము ప్రధానమైనదే. సాటిమానవుని తనతో సమానముగ చూచుటకంటె పరమ ధర్మములేదు.

ఈ యతిథిసేవా ధర్మమును గృహస్థులేకాకుండ యోగులు సన్యాసులు సైతము ఆచరిస్తారు. ఋషులు తమ ఆశ్రమానికి వచ్చినవారికి అర్ఘ్యపాద్యములిచ్చి, విశ్రాంతి చేకూర్చి వారికి వలయు సదుపాయాలన్నీ చేసి వారి కోరికలను నెరవేర్చి పంపినట్లు మన గ్రంథాలలో చదువుచున్నాము.

అన్ని సంగములు వీడినవారే అట్లుండ నిక గృహాశ్రమములోనున్నవారికెంత యావశ్యకమో యూహించుడు. అతిథి సత్కారము చేయువారనిన్ని యింటివారికి ఊరివారికికూడా దేవతలవలె కనబడతారు. అట్టివారి యిండ్లలోని పరిచారకులుకూడా స్వామిభక్తిని చూపుతారు. విరివిగా ఆహార పదార్థముల వితరణ జరుగునపుడే ప్రాణికిని లోపము కలుగదు గదా! ఉత్సాహవంతుడైన యజమాని డబ్బు ఖర్చగుచున్నదను భావమే మరచిపోతాడు. కొంత కాలానికది యొక వ్రతమును, నియమముగాను పరిణమిస్తుంది. తమ యింటికివచ్చిన ప్రతివ్యక్తిపొందే ఆనందము సంతృప్తి చూచిన యజమానికి కలిగే ఆనందాతిశయానికి హద్దుండదు. దిగంత విశ్రాంతమైన కీర్తి వెల్లువలో మునిగిపోయి తమ జీవితము ధన్యమైన దానినిగా తలుస్తారు. దీనివలన విశ్వమానవ సౌభ్రాతృత్వము అలవడి లౌకిక వ్యాపారాలలోకూడా సంపూర్ణ విజయాన్నే పొందుతారు.

ఈ సేవాధర్మము స్త్రీలపై నెక్కువగా ఆధారపడి ఉంటుంది. ఇంటికివచ్చినవారి నాదరించుటలో ఇల్లాలిదే యెక్కువ బాధ్యత. ఆమె సరళ హృదయ కావలెను. తన యీ బాధ్యతను చక్కగా గుర్తించి యింటికి వచ్చినవారి తాలూకు పూర్వ వైరాలను మత్సరాలను మనసులోనికి రానీయకుండా భక్తి శ్రద్ధలతో "మానవసేవయే మాధవసేవ" అనుభావముతో సమాదరణ చూపిన యెడల వారి హృదయాలుకూడా పూర్తిగా పరివర్తనబొంది సాధువులగుదురనుట కెట్టి సంశయము నుండదు. "అద్వేష్టా సర్వభూతానాం। మైత్రః కరుణయేవచ" ఏ మానవునియందును ద్వేషమునుజూపక ప్రేమతో దయగలిగి యుండవలెనను గీతా వాక్యమునుబట్టి అతిథిసేవా తత్పరులకు భక్తియోగసిద్ధికూడా కలుగుతుంది.

"యతఃప్రవృత్తిర్భూతానాం। యేనసర్వమిదంతతం।
స్వకర్మణా తమభ్యర్చ్య। సిద్ధిం విందతి మానవః"

సమస్త ప్రాణులకు ప్రవర్తకుడును చరాచర ప్రపంచమంతట వ్యాపించియున్న భగవంతుని మానవులు తమకు విహితమైన కర్మలచేతనే యారాధించి ఫలసిద్ధిని బొందుచున్నారు, అని గీతావాక్యము. గృహస్థులగువారు తమ తమ వ్యాపారాలలోనుండియు, వారుచేయుపనినే అన్యాయములేకుండ భగవత్పర

ముగా చేసినయెడల ముక్తిని బొందవచ్చును. భగవత్పరమనుటతోడనే దుష్కర్మజోలికి పోవుటకు వీలుండదు. సత్కర్మాచరణమే అభ్యాసమవుతుంది. అతిధిసేవనే తీసుకుందాము. ఆ యతిధి భగవదంశా స్వరూపుడని భావించి, అతనిని త్రికరణ శుద్ధిగా పూజించిన యెడల భగవంతుని పూజించినట్లే అవుతుంది. అట్టి విశ్వాసముతో చేసేసేవ సత్కారము సర్వవ్యాపకుడు సర్వభూతాంతర్వర్తియునగు భగవంతుని జేరుటలో నెట్టి సందేహము నుండదు. ఇది నిత్య కృత్యములో ప్రతి మానవుడు చేయదగిన కార్యము. విశేష ధన సంపత్తిలేకపోయినా పవిత్ర హృదయము ఆదరాభిమానములున్నచాలును. నిర్ధనులు భక్తితో మంచి తీర్థమిచ్చినచాలు, వాకిటిలోనికి వచ్చినవారు తృప్తిని పొందుతారు. "ప్రీతి ముఖ్యంతు భోజనమ్" అని "భక్తి కలుగుకూడు పట్టెడైనను చాలు"నని ప్రియముతో బెట్టు భోజనము విందుకంటె గొప్పదిగా భావిస్తారు. ఒక్క అతిథి సత్కారమును ప్రధాన నియమముగా తీసికొని జీవయాత్ర సాగించినచాలు. గీతలో జెప్పిన కర్మయోగ సిద్ధి కలుగుతుంది.

మన హిందూ దేశము అతిథి సపర్యకు పేరెన్నికగన్న దేశము. పరదేశీయులకు పాఠము నేర్పింది. ఎంత కరువు వచ్చినా మనవారి యాచారాన్ని మానలేదు. అతిథిసేవవల్ల అఖండకీర్తి గడించిన డొక్కా సీతమ్మగారివంటి మృతజీవు లిప్పటికి అక్కడక్కడ లేకపోలేదు.

కాన గృహ జీవితములో అతిథి సత్కారమొక ప్రధానాంశముగా తీసికొన్నవారి గృహము స్వర్గసీమ అగుటయే గాక; అపరోక్షమైన ఫలసిద్ధినిగూడా పొందవచ్చు.

(ఆలిండియా రేడియో విజయవాడవారి సౌజన్యముతో)




శ్రీ 'విజయ-రాఘవ'

శ్రీధరం చెట్టుక్రింద వకీలు వృత్తి చేయడానికి బి. ఎ బియల్. ప్యాసయి నాడు. కాని దానిమీద జీవసం గడపడం ఒకరకంగా అవమానమనిపించింది. పగలల్లా ఆ చెట్టుక్రిందా - ఆ చెట్టుక్రిందా పడి గాపులుపడి కలంలో సిరా అయ్యేదాకా తెల్లకాగితాల్ని నల్లబరచి - పదిమందితో అబద్ధాలాడించగా - వచ్చేముష్టి ముప్పయి రూపాయిల్తో యిద్దరు బ్రతకాలి. తను గాకుండా అద్దైనా వారానికి రెండు సార్లో ఒకసారో. అంతే సలభై యేళ్లు ముంచుకొచ్చేసరికి స్వేచ్ఛగా బ్రతకాలనిపించింది. ఈ స్వేచ్ఛను చిన్నప్పటినుంచీ కోరుతూనే వున్నాడు. కాని దక్కింది యీ నాటికి. చేస్తూ - చేస్తూ వకీలు వృత్తికి స్వస్తి చెప్పాడు. పోనీ తనకు చిన్నతనంనుండీ 'లలిత కళల' మీద అభిరుచిగదా! దాని మీద కృషి చేసి ప్రపంచానికి 'కళ'యొక్క విశిష్ఠత చూపుదామా అంటే, 'కళ' పేరు చెప్పితేనే ప్రతివాడు హేయ పడతాడు. తనకు 'కళ'ను గురించి తెలుసుకోవాలనీ - దానిలో ఆరితేరాలనీ - వున్నమాట వాస్తవమే. అందులో ముఖ్యంగా అభిమానమైన 'సాహిత్యం'లో బాగా కృషిచేసి యేదో రకంగా పేరు ప్రతిష్ఠలు - సమయానుకూలంగా ధనసంపాదన చేయాలని 'నవలా-గేయా' సాహిత్యంలో నానావిధాలుగా ప్రయత్నించాడు. ఫలితాన్ని చూపెట్టాడు చివరకు నాల్గయిదు నవలల్లో - రెండు సంపుటాల గేయాల్లో.

పెద్దకూతురు వివాహంచేసి కాపురానికి పంపాడు. రెండోకూతురు 'సుధ' విషయం విచారిస్తే కాళ్లు లేవు పుట్టుకతోనే. త్రోపుడుబండిలో కూర్చొని యిక్కడకు - అక్కడకు ఆ యింట్లో తిరుగాడగలదు. కాని తెలివితేటల్లో మాత్రం శ్రీధరంకన్న యెక్కువే. తండ్రిఛాయల్లోనే కవిత్వా వీధిలో తిరుగాడనారంభించింది. రజస్వల యిన నాటనుండి శ్రీధరం ఆమెకు పెండ్లి చేయాలని తహతహలాడుతున్నాడు. కాని

చేసుకునేదెవరు? తెనుగు సాహిత్యంలో తనతోబాటు రాణిస్తోంది. ప్రతిరోజూ తనకు వచ్చినట్లే పత్రికా సంపాదకులనుండి కథలు పంపమని వుత్తరాలు వస్తూనే వున్నాయి. వాటితో యెలాగో ఫలితం దక్కించేది. దయదల్చి పంపే పారితోషికాలే ఆమెకు ఒకరకంగా జీవితానికి ప్రోత్సాహమిచ్చేవి. దాంతో యింట్లో గడవటానికి కూడా వీలవుతుండేది.

ముఖ్యంగా శ్రీధరంకి పట్టుకుంది మొండితనం ఒక్కటే. మొదట్లో యీ మొండితనంలేదు. తరువాత పరిస్థితుల మార్పుల్లో యీ మొండితనం మొన తేలటం మొదలెట్టింది. ఎంతకాలంబట్టో తనకుటుంబానికి ఆదుకుంటున్న మేనల్లునికిచ్చి 'సుధ'ను పెళ్లి చేయాలని కాని అంతలో తగిలే గడ్డుసమస్య మనస్సుకు తృప్తికలిగించటంలేదు. "అంగవికలాంగురాలైన తన కూతురుకు వివాహమేచేస్తే - ఆవ్యక్తివల్ల మానసికానందం అతనెల్లా పొందగలడు!" ఇదే సమస్యమీద అతనెన్నో కథానికలు నవలా రచనలు చేసాడు. అదే సిద్ధాంతం తన స్వంతానికి వచ్చేటప్పటికి 'సంఘం' అనేది అడ్డువచ్చింది. సంఘాన్ని కాదనలేడు. సంఘాచారాల్ని తప్పనలేడు. వ్రాతల్లోచూపే వుద్దేశ్యాలు చేతల్లో కొచ్చేటప్పటికి విముఖత్వం చెందుతున్నాయి. మేనల్లున్ని సంప్రదించాడు. పిల్లతరఫున వచ్చే 'రెండు కుంటలభూమి కోసం మేనల్లుడు శంకరం' రూపురేఖలు - విలాసాలు - వినోదాలతో నిమిత్తంలేదు. తల్లి మాటదాటలేని శంకరం వ్యక్తిత్వం విడిచిపెట్టి అమ్మకు చెప్పుకోని 'సుధ'ను వివాహం చేసుకుంటానికి ఒప్పుకున్నాడు. ఆస్తి పిల్లవైపున తరుముకోస్తోందిగదా అని శంకరానికి ఆనందం ఆగడంలేదు. శ్రీధరంకి స్వయంగా వెళ్లి చెప్పుకున్నాడు - "మా అమ్మ ఊ" ...! అందని శ్రీధరం తబ్బిబ్బయి పోయాడు. సంతోషం పట్టలేక పోయాడు. పోతే పోయింది రెండుకుంటలు, ఉన్న భారం తీరుతోంది గదా అని కన్నకుమార్తె మనస్సుకూడా తెలుసుకోకుండా వివాహం చేయ నిశ్చయించాడు. యీ నిశ్చయం యెంతవరకు తనగౌరవానికి - తన సిద్ధాంతాలకు - వ్యతిరేకమో గ్రహించుకోలేక పోయాడా? తండ్రి మాటకు ఎదురు చెప్పటం చేతకాని 'సుధ' శంకరంతో మిథునలగ్నంలో మాంగల్యాన్ని కట్టించుకొంది. కాని వెక్కి వెక్కి ఒక్కసారి యేడ్చింది పెళ్లయిన తరువాత, తండ్రిని తల్చుకొని.

ఒక నాడు 'సుధ' ఉదయం పదిగంటల వేళ 'వ్యథిత హృదయం' అనేకథ వ్రాస్తోంది. శ్రీధరం అప్పుడే భోంచేసి

వసారాలోకి వచ్చాడు. చుట్ట వెలిగించి పడక కుర్చీలో జారగిలపడ్డాడు. చుట్ట సగం కాలేటప్పటికి 'సుధ' కథ పూర్తి చేసింది. తండ్రివైపుకు తిరిగింది. శ్రీధరం చుట్ట పారేసి గ్లాసుడు చెరువుమంచినీళ్లు గటగట త్రాగి -

"సుధా! యేమిటో వ్రాసినట్టున్నావ్" అన్నాడు.

"ఆ .... ఏ ముంది నాన్నా! ఏదో కథ వ్రాశాను" — అంది.

"పేరేం పెట్టావ్?" — శ్రీధరం.

"వ్యధిత హృదయం" — సుధ.

శ్రీధరం కథపేరు పెళ్లున వినేటప్పటికి ఒక్క నిట్టూర్పు విడిచాడు. ఆ నిట్టూర్పులో యేవో ఆశలు విఫలమైనట్లు పొడచూపాయి. కళ్లుజేవురుమన్నాయి. పట్టిన చెమటను పైటర్కీ తువ్వాలుతో అద్దాడు.

"నాన్నా" — అందామె

'ఊ' ....!—అన్నాడు. ఆలోచనల్లోంచి మేల్కొని.

"ఏమిటో ఆలోచిస్తున్నాట్లాగావుంది"- అంది సుధ.

"ఆ .... యేముంటాయి - " కథ పేరు వినంగానే కొంచెం పిచ్చి తలపులు రేకెత్తాయి....అంతే" అన్నాడు శ్రీధరం.

"ఎందుకని నాన్నా"! —

శ్రీధరం జవాబివ్వలేక పోయాడు.

"సుధా! కథ చదువూ—" అన్నాడు వెంటనే శ్రీధరం.

రెండు ముక్కల్లో కథను తీర్చేసింది. శ్రీధరం నివ్వెరపోయాడు. తను చేసిన వెధవపనికి యిప్పుడు సిగ్గుపడ్డాడు; లాభం?

ఇల్లా కథవ్రాసి తనకు పశ్చాత్తాపం కలిగించ తల్చుకుందా? లేక మానాన్నారు యిలా నాజీవితం పాడుచేశారని ప్రపంచానికి తెలియజేయాలనుకుందా? అలా ఎదురుగా ప్రవర్తించడానికి ఎప్పుడూ తన మాటకు ఎదురు చెప్పలేదే? మరి యేమిటిది!

సుధ యొక్క వ్యక్తి గత జీవితం ఒక్కటే ప్రతిబింబింప చేసిందాకథలో. "సమాజంలో వ్రాతలు ఎంత హాయిని గొల్పుతాయో — చేతలో అంత బాధను చేస్తాయి. శ్రీధరంకన్నకూతురుకు ద్రోహం చేశాడు. సమాజానికి వెరచి సుధకు స్వేచ్ఛ లేకుండా చేశాడు. ఒకవేళచేసినా ఆమె వలన మానసికానందం ఎలాగైనా లభింపదుగదా! కాకపోతే శ్రీధరానికి తీరిందా కూతురు భారం. ఇదేవిధంగా అయితే శ్రీధరంకి కూతురు బదులుగా కుమారుడే వుంటే కుంటిపిల్లను తీసికొచ్చి చేస్తాడా?

అందువలన యెందుకు యింత పాడుపని చేయాలి ?'' అంటూ యింకా కొన్ని విషయాలు ఆ కథలో స్పష్టపరచింది. చివరకు కథలోనే, "కన్నకూతురు హృదయం తెలుసుకోలేని మూఢులు యింకా చాలా మంది వున్నారని-'' 'స్త్రీ' అంటే యేమిటో తెలుసుకోకుండా — ఆమె ప్రత్యేకంగా వంటయింటి కుందేలుగా విలాసకృత్యానికి వుపయోగించే ఆట బొమ్మగా - స్వేచ్ఛలేని బానిసగా తల్చారని వ్రాసింది. స్త్రీలకు కూడా విజ్ఞానతృష్ణ వుంటుందని - వ్యక్తిగత జీవితాలపై ఎంత బాధ్యత వుండి వున్నదో – ఏది మంచో - చెడో - యే విషయం అంగీకరించాలో – యేది కూడదో యిటువంటి విషయాలలో హక్కువుందని కన్న తండ్రులంగదా అని అంగవికలాంగులైన కుమార్తెలకు యిష్టంవచ్చినట్లు, ఎటువంటి సంప్రదింపులు లేకుండా యెవరికో ధనం గలవాడికి అంటగట్టటం - భారం తీర్చుకోవాలని ప్రయత్నించడం వివేకులయినవారికి తగిన పనికాదంటూ'' కథను ముగిస్తూ – కథలోని కథానాయికచేత "ఆస్తికోసం నన్ను వివాహమాడారు - నేను యే విధంగాకూడా మానసికంగా ఆనందాన్ని యివ్వలేను - పొందలేను - అందువలన మీరు పరోక్షంగా ప్రవర్తించవచ్చు - కాని అదే చనువుమీద నా జీవితాన్ని నాశనంచేసి - నన్ను మరిచిపోయి నన్ను వేరుగాభావించవద్దు'' అంటూ భర్తకు నివేదించుకున్నట్టు తన మనవిని కథా సంపూర్ణం చేసింది.

సుధ లేనివేళ ఆ కథచదివి శ్రీధరం యేడ్చాడు. దాని ఫలితంగా "తప్పునాదే'' అనే కథానిక వ్రాసి, కూతురుతో కూడా 'తప్పునాదే' అని నోటితో అన్నాడు. సుధ కన్నీళ్లు కార్చింది. శ్రీధరం ఖిన్న వదనుడై యెంతపని చేసానని ఖేదపడ్డాడు. లాభం ?





# శిశుపోషణ

"కంబాల"

నేటి బాలలే రేపటి పౌరులు. అలా భావి పౌరుల విషయంలో ఎంతో శ్రద్ధ తీసుకోనవలసివుంది. కాని అధిక సంఖ్యాకులకు ఈ విషయమై ఏ విధంగా జాగ్రత్త తీసుకోవాలో తెలియదు. కొందరు తెలిసినా నిర్లక్ష్యంచేస్తారు. దీనివలన ఎంతో నష్టం కలుగుచున్నట్లు పరిశోధనలు నిరూపించాయి. ఒకే సారి జన్మించిన కవలలను వేరుచేసి అందొక శిశువును సక్రమ విధానంలో పోషించి, సరియైన శిక్షణగరిపి రెండో శిశువును "మామూలుగా" పెంచి చూడగా వారిద్దరిలో ఎంతో వ్యత్యాసం కనిపిస్తుంది. అందువలన శిశువుల పెంపకంలో ప్రత్యేక శ్రద్ధయొక్క ప్రాముఖ్యం ఎనలేనిది. రోగంవచ్చాక మందు తీసుకోనేకంటె అసలు రోగం రాకుండా జాగ్రత్త తీసుకోడం ఎంత వాంఛనీయమో అలాగే పిల్లలు దురభ్యాసాలకు, అనారోగ్యానికి గురిఅయ్యాక నివారణప్రయత్నాలుచేసేకంటే ముందే అవి దరిచేరకుండా జాగ్రత్త తీసుకోడము వాంఛనీయం. అందువలన శిశువు పుట్టిందిమొదలు పోషణలో శిక్షణలో సరియైన అభ్యాసాలు, జాగ్రత్తలు అలవడేలాచేయాలి.

శిశుపోషణ, సంరక్షణ విషయమై డా॥ కొమరాజు అచ్చమాంబ వ్రాసిన "ప్రసూతి-శిశుపోషణ" శ్రీమతి పార్వతీ శ్రీనివాసన్ వ్రాసిన "మాతృత్వము - శిశుసంరక్షణ" (తమిళంనుండి అనువాదం) తప్పితే తెలుగులో ఇంకేపుస్తకాలులేవు. పిల్లల మానసిక విజ్ఞాన వికాసానికి డా॥ బి. కుప్పుస్వామి వ్రాసిన "శిశుమనోవిజ్ఞానము" చలంగారువ్రాసిన "బిడ్డల శిక్షణ" ఉన్నాయి. కాని బిడ్డల్ని ఏక్రమంలో పెంచవలెనో వారికి ఏలాటి శిక్షణ గరపాలో అధికారపూర్వకమైన శాస్త్రీయ విజ్ఞానాన్ని సమగ్రంగా పైపుస్తకాలేవీ ఇవ్వవు. అలాంటి మంచి పుస్తకాలు ఇంగ్లీషులో ఎన్నో ఉన్నాయి. బిడ్డల్ని కని పోషించే స్త్రీ వాటిని చదివితే ఎంతో అనవసర ఆందోళన, ధనవ్యయం, అనారోగ్యం తప్పిపోతాయి. బిడ్డ పుట్టిందిమొదలు యౌవ్వనవంతుడయేవరకు వివిధ వయస్సులలో ఎలా సంరక్షించాలో, ఉత్పన్నమయ్యే వివిధసమస్యల్ని ఎలాపరిష్కరించాలో, అతని శరీర ఆరోగ్యం మానసిక వికాసానికి ఎలా దోహదం చేయాలో ఆ పుస్తకాలు వివరిస్తాయి.

## శిశువు నేత్రాల రక్షణ

బిడ్డ జనించిన వెంటనే కావలసింది - చలికాలమయితే వెచ్చదనం. చంటి బిడ్డను గోరువెచ్చల నీటిలో మాత్రమే స్నానం చేయించి వెచ్చని దుస్తులు కప్పాలి. కొన్ని రోజులవరకు తీవ్రమైన ఎండ

లోనికి తీసుకొని వెళ్ళకూడదు. ఎందుచేతనంటే పసి బిడ్డ నేత్రాలు చాల మృదువుగా ఉండుటంవలన సూర్యకిరణాలకు తట్టుకోలేవు. తల్లికి సెగలాటి రోగాలుంటే ప్రసవించిన వెంటనే శిశువు కండ్లను సిల్వర్ నైట్రేట్ సొల్యూషన్‌తో కడగాలి. ఇలా చేస్తే బిడ్డకు వ్యాధి సోకదు. వ్యాధిలేకున్నా ఏమీ నష్టంలేదు. నేత్రాల సంరక్షణలో ఈ జాగ్రత్తలు విస్మరించకూడదు.

## తల్లిపాల శ్రేష్ఠత

శిశువుకు తల్లిపాలు చాల సులభంగా జీర్ణమవుతవి కనుక అది మంచి ఆహారం. కొందరు ఆధునిక స్త్రీలు చనుపాలు యివ్వడానికి యిష్టపడరు. శిశువుకు ఆవు పాలతోగాని యితరపాలతోగాని పోషించవచ్చును. కాని ఆ పాలవలన బాల్యంలోగాని తదనంతర జీవితంలోగాని అతని ఆరోగ్యానికి భంగం కలుగవచ్చును. పోతపాలతో పెరిగిన బిడ్డకంటె తల్లి పాలతోపెరిగి పిల్లలు చాల ఆరోగ్యంగానుంటూ చాల తక్కువగా మాత్రమే అనారోగ్యానికి గురి అవుతారు. అదీగాక పోతపాలను యివ్వడములో వాటిని తయారుచేయడంలో అవసరమైనశ్రమ, కాలమూ తల్లిపాలివ్వడంలో కలిసివస్తాయి. అంతేగాక గర్భదశలోను, ప్రసవంలోను గర్భాశయం పొందిన సాగుదల మరల యథాస్థితికి త్వరితంగా రావడానికి చనుపోషణ దోహదంచేస్తుందని వైద్యాధికారులు కనుగొన్నారు. బిడ్డకు తనపాల నివ్వడం ఒక చక్కని అనుభూతి. తల్లికి బిడ్డకు అత్యంత సన్నిహితత్వం కలగడానికిది దోహదం చేస్తుంది. ప్రయాణాల లోను యితర వేళలలోను సులభంగా అందుబాటులో ఉండేవి తల్లిపాలే. అందువలన పెద్ద అవరోధం ఉంటేతప్ప ప్రతి స్త్రీ తన బిడ్డను తన పాలతోనే పోషించడం ఉత్తమం. కొందరు తల్లిగాక వేరే స్త్రీచే బిడ్డలకు పాలిప్పిస్తారు. అలాటి సందర్భాలలో ఆ స్త్రీ సుఖరోగాలు తదితర వ్యాధులకు దూరమై మంచి ఆరోగ్యంలో ఉన్నట్లు నిర్ధారణ సుకోవాలి.

## తల్లి తీసుకోనవలసిన జాగ్రత్త

ప్రసవానంతరం తల్లి తిరిగి పూర్వస్థితికి రావడానికి కొంతకాలం పడుతుంది. ఈ సమయంలో ఆమెకు అదనపు విశ్రాంతి అవసరం. మధ్యాహ్న సమయంలోగాని బిడ్డకు పాలిచ్చిన తర్వాతగాని ఆమె కొంతసేపు నిద్రించడం (లేక విశ్రాంతి తీసుకోడం) పాలసరఫరాను నిలుపుకోడంలో సహకరించును. తన ఆహార విషయంలో ఆమె చాల శ్రద్ధ చూపాలి. పాలు, మజ్జిగ, చిక్కుడు మున్నగు కాయగూరలు, పండ్లు, పప్పుదినుసులు ఎక్కువగా గ్రహించాలి. తన ఆహారంలో ముఖ్యముగా విటమినులు కాల్షియం మున్నగు లవణాలు ఉండేటట్లు చూచుకోవాలి. ఆమె తన బరువు మారకుండా జాగ్రత్త వహించాలి. పాలిచ్చి బిడ్డనుపోషించే స్త్రీకి మామూలు స్త్రీకంటే ఎక్కువగా ద్రవపదార్థాలు కావలసి ఉంటాయి. దాహాన్ని అనుసరించి వాటిని గ్రహించాలి

మొదటివారంలో బిడ్డ రొమ్మును అందుకోడంలో చనుమొనలుకొంచెము నొప్పి చెందవచ్చును. క్రమంగా ఈ నొప్పి తగ్గిపోతుందికాని చనుమొనలు బ్రద్దలై రక్తమువస్తే డాక్టర్ సలహాపై ఆయింటుమెంటును ఉపయోగించాలి. అవి ఎక్కువ బాధగాఉంటే 1 లేక 2 రోజులు నిపిల్ షీల్డు (చనుమొనల్ని రక్షించేసాధనం) ధరించవచ్చును: కాని సాధారణంగా అంత అవసరంలేకుండా చనుమొనలు గట్టిపడటంతో ఆనొప్పి తగ్గుతుంది.

## తల్లి పాలు

శిశువు జన్మించిన 3 లేక 4 రోజులకుగాని తల్లి రొమ్ములలోకి పాలురావు. ఈ సమయంలో బిడ్డకు చాల తక్కువ ఆహారమే లభ్యమవడంవలన కొంత బరువును కోల్పోతాడు. మొట్టమొదట వచ్చేపాలను "కొలాస్ట్రం" అంటారు. ఇదిమామూలు పాలకంటె చిక్కగా ఉంటూ పసుపు పచ్చని రంగులోగాని ఒకసారి నారింజ రంగులోగాని ఉంటాయి. కొన్ని వ్యాధులు రాకుండా బిడ్డను కాపాడగలపదార్థాలు

ఈ "కొలాస్ట్రం"లో ఉంటాయని కొందరు డాక్టర్ల అభిప్రాయం. స్త్రీ పాలు ఆవుపాలవలె ఉండవు. రొమ్మునుండి పిండినపాలు పలచగా నీలవర్ణంలో వెన్నతీసిన పాలవలె కనిపిస్తాయి. అలాగని అవినీళ్ళ పాలని అర్థంకాదు. వీటిలోకూడ ఆవుపాలలో ఉన్నంత మీగడ ఉంటుంది.

## ఆరంభము

మొట్టమొదట శిశువుకు పాలివ్వడంలో చాల జాగ్రత్త అవసరం. పాలిచ్చేముందు తల్లి తనచేతులను పరిశుభ్రంగా కడుక్కోవాలి. రొమ్మును, చనుమొనను పరిశుభ్రమైన నీటితోను, స్టెరిలైజుచేసిన గుడ్డతోను శుభ్రపరచాలి.

ప్రసవమైన వెంటనే శిశువుకు ఆహారం అవసరం లేదు. అలసిపోయి ఉండేబిడ్డకు విశ్రాంతికావాలి. ఆ విశ్రాంతి కాలము బిడ్డ పరిమాణం, ప్రసవనొప్పుల పరిమితినిబట్టి ఉంటుంది. దీర్ఘమైన, కష్టతరమైన ప్రసవంకంటే త్వరితంగా జరిగిన సుఖప్రసవం బిడ్డకు తక్కువ అలసటనే కల్గిస్తుంది. స్త్రీ ప్రసవంలో పొందిన మైకము పరిమితిపైకూడ బిడ్డనిద్రపోయే కాలం ఆధారపడి ఉంటుంది. తల్లిచాల ఎక్కువగా స్పృహతప్పి పడిపోతే బిడ్డనీరసించేటంత ఎక్కువ కాలం నిద్రపోతాడు. ఒకసారి బిడ్డ 24 గంటల లోపుగానే లేచి, కాళ్ళు చేతులు తన్నుకుంటూ ఏడ్వడం మొదలెడుతాడు. అతనికి పాలివ్వడానికి అదే సమయం.

ఆకలితో ఏడ్చే ఆ నూతన జీవి చాలా అసౌఖ్యంగా ఉంటాడు. పాలు తనకు శమనాన్ని కల్గిస్తాయని కూడ అతడికింకనూ తెలియదు. మొట్టమొదట బిడ్డను చేతులతో పైకెత్తి నిలువునా వ్రేలాడదీసి కొంచెముగా ప్రక్కలకు ఊగించాలి. దీనివలన బిడ్డకు గర్భంలో ఉన్నప్పుడు అలవాటుపడిన క్షోభకలగడం వలన వెంటనేశమనం కల్గుతుంది. కాని యిది తక్కువ సేపు అతనిని ఊరడించలేదు. తననోటిని చుట్టూత్రిప్పుకుంటాడు. అప్పుడు చనుమొన తగిలితే దాన్ని పట్టుకొని పీల్చుతాడు. ఒకేసారి చనుమొనను అతనినోటికి తాకించి, లేదా పాలనుపుడిచేముందే అతనికి మంచిరుచిని కల్గించడానికి ఒక్కచుక్కను పిండటం అవసరం కావచ్చు.

బిడ్డనోటిని తెరవడానికి పసిబుగ్గల్ని నొక్కడం చాల దురలవాటు. తనబుగ్గను తాకినవైపుకు తిరిగే ఉన్ముఖత - అతనికుంటుంది. అందువలన రెండు బుగ్గల్ని ఒకేసారి తాకడంవలన బిడ్డ కంగారు పడతాడు. అతనికేమీ తొందర కలిగించకూడదు. కొంచెము సహాయం చేస్తే మొదటి సారి సరియైన విధానానికి అలవడిపోతాడు. బిడ్డ అలా చేయకుంటే అతనిని మరల పరుండబెట్టి కొంతసేపయిన తరువాత తిరిగి ప్రయత్నించాలి.

మొదటి ఒకటి రెండు రోజుల్లో రొమ్ములలో చాల తక్కువపాలు ఉంటాయి గనుక అతడు త్వరగా పాలుత్రాగడం ఆపుజేస్తాడు. మొదటి రోజులలో ఈ విధంగా కొంచెముసేపే పాలివ్వడంవలన మృదువుగానున్న చను మొనలను గట్టిపడడానికి సహాయపడును. పాలు త్రాగగా బిడ్డ యింకనూ ఆకలితో ఉంటే చనుపాలు పూర్తి అయిన తరువాత మరగకాచి చల్లారిననీటిలో గ్లూకోజు లేక పంచదార లేక తేనెవేసి యివ్వాలి. తప్పనిసరి అయిన ప్రత్యేక పరిస్థితులలోతప్ప ఈ మొదటి రోజులలో పోతపాలు యివ్వకూడదు.

## తరువాత పోషణ

ప్రసవమైన తరువాత 3, 4 రోజులలో రొమ్ముల లోనికి పాలువస్తాయి. అప్పుడు పాలిచ్చే కాలాన్ని క్రమంగా హెచ్చించాలి. పాలు త్రాగేటప్పుడు బిడ్డ సరిగా అనుకొని ఉండేటట్లుసావకాశంకా పాలివ్వాలి. కొద్ది వారాలు ప్రక్కలకు పండుకొని పాలివ్వడం మంచిది. ఆతరువాత కూర్చునియివ్వోచ్చు. సాధారణంగా 20 నిమిషాలు పాలుత్రాగితే బిడ్డ సంతృప్తి చెందుతాడు. అతని ఆకలి ఇతరులకంటే అతనికి బాగా తెలుస్తుంది. అందువలన అతనికి యిష్టమైనంతసేపు

తాగనీయాలి. ఒకేసారి ఒకే రొమ్ము పాలివ్వడం మంచిది. పాలు త్రాగినవెంటనే బిడ్డనోటిని కూడా బాగా తుడువాలి.

## గాలి మ్రింగడం

ఒకేసారి శిశువు పాలతోబాటు గాలిని మ్రింగుతాడు. దీనివల్ల కొందరు కొలమారుతారు. అలాంటప్పుడు అతని వీపుపై చేతితో రాస్తుండాలి. పాలు త్రాగడం అయిన తరువాత బిడ్డ తను మ్రింగినగాలిని బహిర్గతం చేసేవరకు భుజంపైకి ఎత్తి అక్కడే ఉంచుకోవాలి.

## నియమావళి

చాలమంది శిశువులు నిద్రలేచిన 3, 4 గంటల గడువులలో పాలనుకోరుతారు. మొదటి వారాలలో పగలు రాత్రికూడా పాలు అవసరం. బిడ్డ కొంచెము ఎదిగిన తరువాత ఒకేసారి ఎక్కువ పాలను గ్రహించగలుగుతాడు గనుక పాలిచ్చే గడువును పొడిగించవచ్చును. సామాన్యంగా 4 గంటల గడువులలో ఉదయం 6 గll 10 గll మధ్యాహ్నం 2 గll సాయింత్రం 6 గll రాత్రి 10 గll తెల్లవారుజామున 2 గllలకు పాలను యివ్వొచ్చు. లేదా తనకు వీలయేటట్టు స్వయంగా ఒక నియమావళిని తయారుచేసుకొనవచ్చును. మొదటి వారాలలో చాలమంది పిల్లలు పై సమచే నిర్ణయానికి అనుగుణంగా ఉండరుగాని ఒక నెల గడిచేసరికి దానికి అలవడిపోతారు. పాలకుతోడు శిశువుకు నీరు కావాలి. మరగబెట్టి చల్లార్చి నీటిని బిడ్డ కోరినన్ని యివ్వడంలో ఏమీభయపడకూడదు. బిడ్డ చాల ఎక్కువ నీటిని త్రాగడు. తన దాహాన్ని అనుసరించి కొలదిగా మాత్రమే త్రాగుతాడు. నీటిని పాలిచ్చే సమయానికి అరగంటముందే యివ్వాలిగాని పాల సమయానికి దగ్గరలో యివ్వగూడదు. ఎండకాలంలో బిడ్డకు గంట గంటకూ కొద్ది కొద్దిగా నీటి నిచ్చినా పరవాలేదు. నీరు పరిశుభ్రమైనవి కావడం ముఖ్యం.

## చనుపాలు తక్కువయితే!

చనుపాలు బిడ్డకు సరిపోతుంటే ఈ క్రింది విధానాలు అవలంబించి వృద్ధిచేయవచ్చును.

1. ప్రతిసారి పాలిచ్చేటప్పుడు రెండు రొమ్ములను ఉపయోగించాలి. ఈ అదనపు పీల్చుడు వలన ఆ రొమ్ముచేపి ఎక్కువ పాలను వర్షింపజేస్తుంది. మొదటిసారి యిచ్చిన రొమ్మును మరల యివ్వాలి.

2. తల్లికి చాల విశ్రాంతి, నైర్మల్యము ఉండాలి. అలసటతోనున్న ఉద్రిక్త స్త్రీకంటె ప్రశాంతంగానున్న స్త్రీ ఎక్కువపాలను యిస్తుంది. ఆమెకు ఎక్కువ విశ్రాంతి, తక్కువ చికాకు (విసుగు, ఆయాసం) ఉండేటట్లు శ్రద్ధ వహించాలి. ఆమె నిద్రాభంగంలేకుండా రాత్రంతా పరుండగలిగితే తెల్లవారుజామున 2 గంటలకు పోతపాలు - మరోమనిషి యివ్వాలి. విశ్రాంతి, పగటి కునుకులు, స్వల్పమైన గృహ కృత్యాలు, ఉత్సాహవంతమైన సహచరులు ఈ విషయంలో చాల సహకరించును.

3. చాల తరుచుగా రొమ్ములను కాళీచేయడం వలన పాల ఉత్పత్తి ఎక్కువగుతుంది గనుక బిడ్డకు 2, 3 గంటల గడువులలోనే పాలివ్వాలి. ఆ తరువాత బిడ్డ చాలసేపు మళ్లీ నిద్రపోతాడు. బిడ్డ పాలు త్రాగిన తరువాత రొమ్ములలో ఉన్న పాలను పిండివేయడం మంచిదని కొందరు డాక్టర్లు సలహా యిస్తారు. ప్రసవమైన కొన్ని రోజుల తరువాత రొమ్ములలో పాలు చాల ఎక్కువై సలుపులు పెట్టేటప్పుడువలె యిప్పుడుకూడ బ్రెస్టుపంపును ఉపయోగించి పాలను తీయవచ్చును. లేదా చేతితో జాగ్రత్తగా పిండవలెను. చేతులను శుభ్రంగా కడుగుకొని శుభ్రమైన గిన్నెను తీసుకొని దాని లోపలి అంచును రొమ్మునకు తాకించి బ్రొటన వ్రేలితో రొమ్ముపైన అదిమి, ఆ బ్రొటనవ్రేలు స్థలం కదపకుండా, రొమ్ము మొదలు వైపు చనుమొనవైపు కదుల్చుచు పాలను తీయాలి. మరో విధంగా పాలనుతీస్తే రొమ్ములకు హాని కలుగవచ్చును.

4. దాహాన్ని అనుసరించి ఎక్కువ ద్రవపదార్థాలు, బి-విటమిను ఎక్కువగాగల మంచి పోషక ఆహారం తగినంతగా గ్రహిస్తుండాలి.

5. మలబద్ధంతో బాధపడుతూ ఉండకూడదు. కావలసినన్ని ఫలములు కాయగూరలు గ్రహిస్తుంటే మలబద్ధము నివారించబడుతుంది. కాని మందులను ఉపయోగించకూడదు. కారణం కాత్తర్టిక్స్ లాంటివి పాలలోకికూడ ప్రాకుతాయి. అవసరమైతే ఖనిజ తైలము లేక "ఎనీమా" ఉపయోగించవచ్చును.

### విటమిన్ల వాడకం

శిశువుకు విటమినులు అత్యవసరం. తల్లిపాల లోను, పచ్చిగడ్డితినే ఆవుపాలలోను యివి కొంత వరకు ఉంటాయి. కాని బిడ్డకు అదనంగా విటమిన్లు యివ్వడం చాల మంచిది. వీటివలన బిడ్డపెరుగుదల లోను, ఆరోగ్యంలోను చాల అభివృద్ధికనబరుస్తాడు. బిడ్డ రెండువారాల వయస్సులో ఉన్నప్పుడే "ఎ,డి" విటమినులవాడకం ప్రారంభించాలి. సూర్యకిరణాలు "డి" విటమినును యిస్తాయి గనుక వేసవిలో పుట్టిన పిల్లలకు ఆహారంలో "డి" విటమిను కొంచెము తక్కువే సరిపోతుంది. చేపకాలేయపునూనె (కాడ్ లివర్ ఆయిల్) యివ్వడానికి నిశ్చయిస్తే పాలు త్రాగిన తరువాత దానిని యివ్వాలి. మొదటి రోజున 3 చుక్కలు, రెండవరోజున 6 చుక్కలు, 3 వ రోజున 9 చుక్కలు ఈ విధంగా రోజు రోజుకు హెచ్చిస్తూ ఒక గరిటెడు పరిమాణంకు తీసుకొని రావాలి. రోజుకు మూడుసార్లు దీని నివ్వాలి. చేప నూనె త్రాగని పిల్లలకు బజారులో లభించే యితర విటమిను సప్లిమెంట్లు డాక్టరు సలహాపై వాడవచ్చును. బిడ్డ ఒక నెల వయస్సులో ఉండగా "సి" విటమిను ప్రారంభించాలి. నారింజరసం టమోటోరసం, కమలాఫలంరసం, బత్తాయిరసంలో ఏదిఅయినా 5, 6 చెంచాలు తెల్లని గుడ్డలోపిండి అందులో కొంచెము నీరు, పంచదార వేసి రోజుకు ఒకటి, రెండు సార్లు యివ్వాలి. నాలుగవ నెలనుండి పండ్లరసం ఎక్కువచేస్తే విరేచనం సరిగా అవుతుందికూడ. అర గరిటెతో ప్రారంభించి క్రమంగా హెచ్చిస్తూ రోజుకు రెండు ఔన్సులవరకు యివ్వాలి.

### చనుపాల విరమణ

తరువాతి గర్భంవచ్చేవరకు పిల్లలకు చనుపాలివ్వ డము మంచిదికాదు; బిడ్డపుట్టిన తొమ్మిది మాసాల తరువాత చనుపాలు యివ్వడముమాని ఆవుపాలనే ఇవ్వడము తల్లికి, బిడ్డకుకూడ చాల మంచిది. చను పాలను ఒక్కసారిగా కాక నెమ్మదిగా తప్పించాలి. ఆరవమాసమునుండే అప్పుడప్పుడు పోతపాలనిస్తూ బిడ్డ దానికి అలవడేటట్లు చేయవచ్చును. (అంతేగాని రొమ్ములకు చేదుమందులురాసి తప్పించడము హాని కరం) అలాచేస్తే 8 నుండి 10 మాసాలలో బిడ్డ చను పాలకంటే పోతపాలకే ఎక్కువశ్రద్ధ చూపుతున్నట్లు కనుగొనవచ్చును. అప్పుడు సక్రమంగా చనుపాలిచ్చే కాలాన్ని తగ్గించవచ్చును. పోతపాలను బిడ్డ బాగా త్రాగుతుంటే చనుపాలు పూర్తిగా విరమించవచ్చును.

### పోతపాలు

తల్లిపాలు బొత్తిగా లేకపోయినప్పుడు, చాలక పోయినప్పుడు ముందు చెప్పిన పద్ధతులలో వృద్ధిచేసు కోడం సాధ్యంకాకుంటే పోతపాలు తప్పనిసరి అవు తాయి. తల్లిలో క్షయలాటి వ్యాధిఉన్నా, ఆమె యితరత్రా అనారోగ్యంగా ఉన్నాకూడ పోతపాలే వాడాలి. ఏకారణంచేతనైనా తల్లి కొన్ని గంటలు బిడ్డదగ్గర లేకపోతేగూడ పోతపాలతో బిడ్డను సముదాయించవచ్చును. ఆవుపాలలో సగానికి నీటినికలిపి పలుచనచేసి కొంత పంచదారకలిపిగాని, లేక డబ్బాపాలనుగాని ఉపయోగించవచ్చును. కాని పోతపాలను ఉపయోగించేటప్పుడు ఎంతో జాగ్రత్త అవసరం. ఉపయోగించే పాత్రలు; పరికరాలు తరచుస్టెరిలైజుచేయాలి. పాలను రిఫ్రిజిరేటర్‌లో ఉంచాలి. బర్రెపాలు అయితే నీరు యింకా ఎక్కువ కలుపాలి. ఆవుగాని, బర్రెగాని జబ్బులేవీ లేనట్టివై ఉండాలి. పాలు తీసేటప్పుడుకూడ పితికేవాని

ద్వారా క్రిములు పాలలో ప్రవేశించకుండా జాగ్రత్త తీసుకోవాలి. మంచినీటికివలె పాలుకూడ మరగకాచి చల్లార్చినవే ఉపయోగించడం మంచిది. ఈ జాగ్రత్తలు, పరిశుభ్రత అమలుజరపకుంటె బిడ్డ అనారోగ్యానికి గురికావచ్చును.

## సంరక్షణ అంశాలు

ఈ విషయం ఎక్కువగా వివరించకున్నా కొన్ని విషయాలు పేర్కొనడం అవసరం. బిడ్డ ఏడ్పు విషయం జాగ్రత్త వహించాలి. ప్రతిసారీ ఆకలివల్లనే ఏడ్వడు. శరీరంలో అసౌఖ్యం ఉండటంవల్ల కూడా ఏడుస్తాడు. దీనిని కనుగొనాలి. సక్రమంగా షెడ్యూలు ప్రకారం పాలిస్తుంటే మధ్యలో ఏడ్చినా పాలివ్వకూడదు. కొంతమంది ఏడుపువిని బిడ్డకు ఊపిరాడకుండా రొమ్మును నోట్లో కుక్కుతారు. రాత్రులు బిడ్డనోట్లో రొమ్మునువిడిచి నిద్రపోవడం దురలవాటు; ఆముదంపట్టడం మంచిదికాదు. పండ్లరసం యిస్తుంటే విరేచనం సక్రమంగా అవుతుంది.

సరియైన కాలానికి శిశువును పడుకోబెట్టాలి. బిడ్డపెరుగుదలకు ఆహారం ఎంత అవసరమో నిద్రకూడ అంత అవసరం. గాలి వెలుతురు వచ్చేగదిలోనే బిడ్డ ప్రశాంతంగా నిద్రపోవాలి. వారసాలలు; పోలికలు చెప్పుకోడాలతో లేక సినిమాలు మున్నగు వినోద ప్రదర్శనలకు బిడ్డల్ని తీసుకుపోవడంతో వారి నిద్రని పాడుచేసే తలిదండ్రులు తమకు తెలియకుండానే పిల్లలకు చాల హానిని కలిగిస్తున్నారన్నమాట. ఉయ్యాల ఉపయోగించకుండా, జోలపాడకుండా నిద్రపుచ్చడం అవసరం. పుట్టినప్పటినుండి శిశువుకు వేరేప్రక్క ఉండాలి. బిడ్డకి ప్రత్యేకముగా ఎత్తు తక్కువగల చిన్నమంచం వేయాలి. ఎక్కువగా యెత్తుకోడంకూడ మంచిదికాదు. హానికరమయిన వస్తువులు బిడ్డకు దూరముచేయాలి. ఎవ్వరిని బిడ్డను ముద్దుపెట్టుకొననీయరాదు. ఎవరికి ఏరోగముందో పైకి తెలియదు. సిఫిలిస్ (సవాయి) మున్నగురోగాలు ఈ ముద్దులవలన పసిపిల్లలకు సంక్రమించిన అనేక కేసులు ఉన్నాయి. ఒళ్ళో కూచోపెట్టుకోకుండా స్వేచ్ఛగా స్వతంత్రంగా ఒంటరిగా ఆడుకోనివ్వాలి

('గోలకొండ' నుండి)



# పార్వతీ!

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ

---

### ౧

జరుగని మాట మానవులు
సాగనిబాట బుధాఘమెన్నడున్
దిరుగని వేట యెల్లపుడు
తీర్చెడు వేట ఖరాంశు తాపమున్
బరపని తోట రజ్జులను
పట్టెడు జూట తపస్వి ముఖ్యులన్
దఱిమెడు మోట నిందలకు
తప్పక బాల్పడు ధాత్రి పార్వతీ!

### ౨

అఱుగని తిండి కీలెడలి
యధ్వమునం బడు బండి రిత్తగాఁ
దిరుగు శిఖండి ప్రీతిమెయిఁ
దెక్కలి కాండ్రిడు మేల్పసిడి రాల్
దఱచగు పిండి పండితుల
లాలన చేయని మొండి యర్థులన్
జుఱ జుఱ జూచు రండి కడు
శోకము నిచ్చుదలంప పార్వతీ!

### ౩

శూరుల చివ్వ యాకటను
స్రుక్కిన వేళకుఁ గల్గు బువ్వ త
న్నారసి బ్రోవు నవ్వ బెడ
గారెడుఁ బెంపుడు గువ్వ యింటిలో
దూరని రవ్వ క్రొవ్విరుల
తోఁ రహించెడు తివ్వ నాతికాన్
దూరిన నెవ్వ మానవులు
దొడ్డయటందురు ధాత్రి పార్వతీ!

### ౪

కలుషల విందు తన్గవయు
గ్రాగు మిటారుల పొందు రోగముం
వాల గఁగ జేయుమందు కడుఁ
దొడ్డగ విద్దెల నేర్చుకుందు పు
వ్వుల పొదరిండ్ల క్రిందు సిరి
బోడుల మేని ఘసందు నాతికిం
చెలువుడు గట్టు బొందునుతిఁ
జెందు దలంపఁగనెందు పార్వతీ!



లతో విరోధం తెచ్చుకుంటే చాలా ప్రమాదం అని చెప్పారు. డాక్టర్లు చాలా హుందాగా చెప్పి వెళ్తూ ఉంటారు "ఆహారం యిమడనప్పుడు బలవంతంగా యివ్వకండి. నర్సు ముక్కు-ద్వారా ఆహారాన్ని ఇస్తుంది." అని. కానీ వీళ్లు ఏమాటా సరిగా విని చెయ్యరు. బీదలకు ఎనిమా యివ్వటానికి కూడా వీరికి విసుకే. ప్రతి దానికీ చెయ్యిజాపటం - ఇస్తే సంతోషం, ఇవ్వకపోతే అడుగడుకూ బెదిరింపే. ముఖం చిట్లిస్తూ "కావలిస్తే మామీద రిపోర్టు చేసుకోండి డాక్టరుగారితో" అని నోరుచేసుకుంటారు. డాక్టరుతో రిపోర్టుచేసే స్థోమతే వుంటే అన్ని విధాలా చక్కని. వైద్యం చేయించుకో కలిగేవాళ్ళే! చేతిని విదిలించ కలిగినచోట చిలకలవలె ఎలా అభినయించ గలరో అని అతనికి ఆశ్చర్యం కలిగింది. గేటు వద్దవుండే వాడు తనకు రహస్యంగా లంచం డబ్బులు యిచ్చేవాణ్ణి ఎంత జనంలో నుంచైనా ఎట్టి అసమయంలోనైనా ఉపాయంగా లోనికి ప్రవేశింపజేసేవాడు. డబ్బుగలవాణ్ణీ ఉద్యోగినీ దూరాన్నుంచే పసిపట్టి "బాబుగారొస్తున్నారు, దొరగారొస్తున్నా"రంటూ జనాన్ని వొత్తిగిల బెట్టేవాడు మిగిలిన వాళ్లను నోటికి వచ్చినట్లు అని ఆపేవాడు. మరణమంటే భయపడి వచ్చిన రోగి యిక్కడి యీ అనుభవాలకంటే మరణమే మేలనిపించేది. రోగివెంటవుండే సహాయకులకు వీళ్ల ప్రవర్తనవల్ల ప్రాణం విసికేది.

సంఘ జీవి అయిన మానవుడు స్వార్థప్రియతవల్ల సంఘద్రోహిగా మారిపోయాడు. సేవోత్సాహంగానీ, సౌభ్రాత్ర ఆదరణగానీ వీళ్ల ముఖాల్లోకనుపించనందువల్ల నిద్రముఖాలతో మెడలువంచుకొని కాళ్లీడ్చుకుంటూ వార్డుళ్ళల్లో తిరుగుతూన్నప్పుడు వాళ్లదుస్తులుగానీ, ఆడంబరంగానీ కష్టాల్లో వున్నవాళ్లకు గౌరవభావాన్నిగానీ ఆశనుగానీ కలిగించలేక పోయేవి. వాళ్ల మెడలచుట్టూ వున్నస్టెతస్కోపులు నిర్జీవంగా హతసర్పాలవలె ప్రతిక్షణం భయంకరంగా తోచేవి.

ప్రపంచంలోకల్లా వైద్యవృత్తి, నర్సువృత్తి ఎంత పవిత్రమైనవి, ఎంత మహిమాన్వితమైనవి! ఎంతమనోహరమైనవి! కానీ సేవాభావం, ప్రియవచనం, సమదృష్టీ, పరోపకారబుద్ధీ లేనప్పుడవి ఎంత వెలతెలా కనిపిస్తాయ్! ఎంత కౄరంగా హేయంగా కనిపిస్తారు వాళ్లు!

ఏ వృత్తి అయినా, ఏ ఉద్యోగమైనా అంతే! ఏ వ్యక్తి అయినా అంతే!

◆ ◆ ◆

లేని ఆశను తెచ్చి పెట్టుకొని అతను తీక్షణమైన రోహిణీ ఎండలో తారురోడ్డు మీదనడిచి ఆస్పత్రి చేరేవాడు. అతని

అతని స్థితిగతులను ఆస్పత్రిలో విచారించారు. అతడు ధనవంతుడు కాడు. భూస్వామి కాడు. యన్. జి. ఓ. కాడు. చదువుకున్నవాడే అయినా నిరుద్యోగి. పిల్లలకు ట్యూషన్లు చెప్పి నెలకు నలభై రూపాయలు మాత్రం ఆర్జించుకొంటున్నాడు. అతని ఆదాయాన్ని బట్టి కూలీగా భావించారు అతన్ని వాళ్లు. పిల్లవాణ్ణి ఆస్పత్రిలో చేర్చుకొని మందు పోస్తున్నారు. ఇతర మందులూ, ఇన్జెక్షన్లూ పాపం తండ్రే కొనవలసివచ్చింది. డాక్టర్లూ, నర్సులూ కనికరిస్తే ఆ నిస్సహాయులకు యింకా సహాయం చేయవచ్చు. కానీ వాళ్లదయాదృష్టి నిజమైన బీదలమీద పడదు. ధనవంతుల మీదా, ఉద్యోగుల మీదా వాళ్ల దయాదృష్టిపడుతుంది. కనుక వాళ్లకే యితర సహాయాలూ జరుగుతూంటాయి. బీదలవల్ల వాళ్లకు ధనాశేమీ వుండదు కనుక మామూలు ధోరణిలో చూస్తూఉంటారు. నర్సులు తమ శుభ్రమైనవుడుపులతో దేవకన్యలవలె తిరుగుతూ వున్నా, బీదరోగులను కసరి మాట్లాడుతూ వున్నప్పుడు ఎంతో వికృతంగా పైశాచికంగా కనపడేవాళ్లు! ధనవంతులూ, ఉద్యోగులూ అయిన రోగులకు మందు లిచ్చేటప్పుడు చిరునవ్వులనూ, సేవానమ్ర భావాలనూ తెచ్చి పెట్టుకొనేవాళ్లు చిత్రంగా! బీదలరోగశయ్యలవద్దకు వచ్చేటప్పటికి అంత విసుకూ, చిరాకూ, కోపం, విదలింపూ అకారణంగా ఎలా తెచ్చి పెట్టుకొనేవాళ్లో!

ట్యూషన్లు చెప్పినందుకు రావలసిన డబ్బులను తిరిగితిరిగి వసూలు చేసుకొనీ, పరపతి ఏమిలేని తాను పుట్టినవరకూ అప్పు చేసీ తెచ్చిన పైకమంతా ఇన్జెక్షన్లకూ తెచ్చుకోమన్న మందులకూ అయిపోగా తమస్నేహానికి గుర్తుగా యిచ్చిన పార్కర్ కలాన్నికూడా అమ్మివేశాడు. ఇక ఎలాగా అన్న దిగులులో పడ్డాడు. బాబుకు ఎన్ని ఇన్జెక్షన్లిచ్చినా, మందులు వాడినా జబ్బు తిరుగుముఖంకాలేదు.

రోజూ కసరుకొంటూ వచ్చేనర్సు ఆ రోజు నవ్వుతూరావటం చిత్రంగా ఉంది.

"ఏమమ్మా, మీ బాబుకు తగ్గుతుందిలే. భయపడకూ" అంటూ ఇన్జెక్షన్ బుడ్డీని వ్రేళ్లసందున ఇరికించుకొని సిరెంజిలోకి మందును లాక్కొని అవతలవార్డులోకి వెళ్లింది. తల్లి నిశ్చేష్టురాలై కొయ్యబారింది. ఇదెక్కడి న్యాయం? మందులు కొని తెచ్చుకోలేని తమ వంటి బీదలమందులనేనా ఇతరులకివ్వటం? బహుశా ఎవరికో మెహర్బానీకొరకు తీసుకపోయివుంటుంది. అదైనా బీదలకోసం అయివుండదు. ఏ ఉద్యోగికో అయివుంటుంది. పెద్దడాక్టరు వచ్చినప్పుడు చెప్పవలెనని ఆమె అనుకొన్నది. కానీ అక్కడి వాళ్లందరూ నర్సు

చెప్పులుగానీ, గొడుగుగానీ పైకి ఖండువా గానీలేదు. రెండుమైళ్ళ దూరానవున్న ఆస్పత్రికి పిచ్చిగా, అనవసరంగా ఎన్నో సార్లు తిరిగేవాడు. లోపలికి ప్రవేశంమాత్రం రెండు సార్లే దొరికేది. దారిద్ర్యంవల్లా నిస్సహాయతవల్లా అతని పితృహృదయం దెబ్బతిన్నది. నిరాదరణవల్లా, నిరాశవల్లా అతని హృదయం మరింత పెద్ద గాయమయింది. తమ వద్దవున్న ఎన్ని వస్తువులను అమ్మి ఇన్జక్షన్లనూ, మందులనూవాడినా బాబుకు జబ్బుతగ్గలేదు. ఇకముందు కానీ కనపడే అవకాశం లేదు. గడచిన అనుభవాల వల్ల మామగారికి గానీ, బావమరదులకుగానీ హృదయాలులేవని తేలిపోయింది. ఇతరబంధువులూ, స్నేహితులూ ఆపదలో సహాయపడే వాళ్లెవళ్లూలేరు. అందరూ ఈ మాట ఒకటి నేర్చారు ''ఈ రోజులలాంటివి. ఒకరికొకరుసహాయపడే రోజులు కావు. తండ్రీ బిడ్డాకానీ, అన్నాతమ్ముడూ కానీ'' అని. ఎటుచూచినా ఆశకవకాశమే లేదు. మధ్యమధ్య చూడడానికి వెళ్లినప్పుడు అతని హృదయం చలించిపోయేది. నిర్మలంగా, కాంతివంతంగా వున్న కళ్లతో నిశ్శబ్దంగా, బాధగా దురదృష్టవంతులైన తల్లిదండ్రులవైపు చూచేవాడు బాబు.



ఏమైనా చెబుతాడేమోనని ఆశతో నిరీక్షించేవాళ్లు అశ్రుపూర్ణనయనాలతో. కానీ ఏమీ చెప్పలేక పోయేవాడు. మధ్య మధ్య వణకుతో తనలేత చేతులను ఎత్తిజాపేవాడు. తల్లి ఆ లేత చేతులను మెడకు చుట్టుకొని తలవంచుకొని ఏడ్చేది. అప్పుడప్పుడు రాజిముండ కొడుతూన్నట్లూ, మామిగాడు తిడుతున్నట్లూ, పలవరించేవాడు. ఆపసి హృదయం ఎన్ని అక్రమాలను, అన్యాయాలను అస్వతంత్రుడు ధనహీనుడూ అయినతండ్రి స్థితినిబట్టి సహించిందో ఈపలవరింతలవల్ల తెలుస్తోంది. ఆస్పత్రిలో చేరి అప్పుడే రెండువారాలు దాటాయి.

తండ్రి మనస్సులోని వేదనా, దుఃఖం ఎవరికి తెలుస్తాయ్ ? నిరుద్యోగి అయినందు వల్లే అస్వతంత్రుడుగా యితరులను ఆశ్రయించవలసివచ్చింది. ఈ కారణం చేతనే బిడ్డలను ఆరోగ్య పద్ధతులలో చక్కగా పోషించుకోలేక పోయాడు. స్వార్థంతోటీ, ఈర్ష్యతోటీ బంధువులు పెట్టిన చిక్కులను భరించవలసివచ్చింది. ముద్దుమాటలతోటీ, బాలక్రీడలతోటీ రంజింపచేసే దైవస్వరూపులైన అతనిపిల్లలను కూడ చూచి సహింపలేక పోయారు. బిడ్డలు పోషణలేకా బొత్తిగాబలహీనులై పోయి ఎక్కడచూచినా సిద్ధంగా కాచుకోనివుండే భయంకర అంటు వ్యాధులకు లోబడ్డారు. దారిద్ర్యంవల్ల జబ్బులూ, అస్వతంత్రతవల్ల ప్రాణాంతకమైన చిక్కులూ వస్తాయని చాలామందికి తెలిసినట్లులేదు. అంతా పూర్వకర్మానుభవమే అనే పిచ్చి నమ్మకమే పట్టుకున్నట్లుంది.

పాపం! ఆ తల్లిదండ్రులు శల్యావశిష్టులై ఉన్నారు. తల్లిస్థితి మరీకష్టంగా వుంది. బాబు పరిస్థితి ప్రమాదకరంగా వున్నందువల్ల చిన్నపిల్లవాణ్ణి ఇరుగు పొరుగు బంధువుల వద్ద విడిచివచ్చింది. బిడ్డ తనను వదలి ఎన్నడూ ఉండలేదు. ఎలా వున్నాడోనని దిగులు ఒకవైపూ, బాబుస్థితి ప్రమాదంగా వున్నందున ఆందోళన ఒకవైపూ బాధిస్తూ ఉన్నాయి. నిద్రలేదు ; సరైన ఆహారంలేదు. హృదయం బలహీనంగా వుండి లేస్తేకళ్లుతిరుగేవి. కాళ్లు తడబడేవి. ఇందుకుతోడు నర్సుల ప్రవర్తనా, డాక్టర్ల అలసభావమూ మరింత కష్టాన్ని కలిగించాయి.

మూడు వారాలుగడిచాయి. అతను డాక్టర్ల చుట్టూ తిరిగి ప్రాధేయపడి అడుగగా వాళ్లు యిలా అన్నారు. "ఎంత కాలంవుండాలో మేమెలా చెప్పగలం ! వ్రాసియిచ్చిన మందులూ, ఇన్జక్షన్లూ తెచ్చుకొంటూ వుండండి. వైద్యం జరుపుతూవుంటాం. తగ్గుతుందా ? తగ్గదా ? ఎంత కాలంవుండాలి ? ఎంతడబ్బుకావాలీ అంటే ఎవరూ చెప్పలేరు. వైద్యం చేయించుకోగలశక్తిలేకపోతే వెళ్లిపొండి" అని విసుగుదలా, కాఠిన్యమూధ్వనింపజేస్తూ.

అతనిమనస్సుకు యింకా కొంతకాలం వుంచి వైద్యం చేయిస్తే బాగుండునని తోచింది. కానీ తానిక ఎక్కడనుంచి డబ్బుతేగలడు ? డబ్బుతేలేనప్పుడు దుర్విధికి తల వొగ్గి మరల ఆ పల్లెటూరికి వెళ్లవలసిందే. ఇక యిక్కడవుండి ప్రయోజనమేముంది ! తాను ఏదోవిధంగా ధనాన్ని సంపాదించలేక పోయినందువల్లే యీనాడు తన బిడ్డకు వైద్యం చేయించలేక పోయాడు.

♦ ♦ ♦

తండ్రి తెలివి తప్పిపోయివున్న బాబును

ఎత్తుకున్నాడు. ఘోర దారిద్ర్యంతో పోట్లాడుతూ అష్టకష్టాలు పడి యింతకాలం పెంచుకొనికూడా సుఖం లేకుండా యీస్థితిలో ఎత్తుకొన్న ఆ తండ్రి దుఃఖభారంతో దుర్బలుడై ఊగిపోతున్నాడు. బాబు మాటలు ఒక్కొటొక్కటే జ్ఞాపకం రాసాగాయి. "నాన్నగారూ నాకు ఐదో యేడు వచ్చిందిగా. బొమ్మలపుస్తకం, పిండిబలపం, బుజ్జిపలకా, వీటిని పెట్టుకోటానికి రంగురంగుల సంచీ తేండి. చదువుకొని గొప్పవాణ్ణి కావద్దూ" ఆ చిన్నతనపు ధైర్యం! ఎంత ఆలోచనగా మాటలు, ఆ ముఖంలో వర్చస్సు! ఆ చిలిపి కళ్లలో ఎంత కాంతి! అందరూ "మంచి పిల్లవాడండీ" అనే వాళ్లు. మందుసీసాలు, పక్కగుడ్డలు తీసుకొని అశ్రుపూర్ణనయనాలతో వెంటవస్తూ వుంది తల్లి. బస్సుస్టేండ్ వద్దకుచేరారు. గ్రుడ్డి, కునిష్టి యాచకులందరూ వాళ్ల పరిస్థితిని తెలుసుకోకుండా చేతులు జాపుతూ చుట్టూ మూగారు. బస్సుచార్జి పోను మిగిలేవి కొన్ని చిల్లరడబ్బులు మాత్రం. ఆ డబ్బులను వాళ్లకు పంచిపెట్టి వాళ్లను వదిలించుకున్నాడు. తను, తన కుటుంబపరిస్థితి, కనపడుతూన్న ఘోరదారిద్ర్యం, మన దేశదారిద్ర్యం, అజ్ఞానం, మూఢనమ్మకాలు ఎన్నో భయంకరమైన ఆలోచనలు అతని బుర్రను కలచివేసినయ్. ఆలోచించలేక పూరుకున్నాడు. ప్రయాణికులందరూ బాబును పరీక్షించి తలా ఒక సలహాయిచ్చారు. తలా ఒక దేవునికి మ్రొక్కుకోమన్నారు. దారాలూ, తాయెత్తులూ కట్టించమన్నారు. దానం యివ్వమన్నారు. దిగదుడుపులు తీయించమన్నారు. "ధర్మాస్పత్రిలో ఆ దోపిడీని భరించగలమనే చేర్చారా? ఆస్పత్రిని నమ్ముకొని పిల్లవాడి జబ్బును ఎందుకు ముదరబెట్టుకొన్నా"రని కొందరు కోప్పడ్డారు. "బంగారంవంటి పిల్లవాడే, అయ్యో పాపం ఐదేండ్లు పెంచుకొనికూడా సుఖం లేకుండా పోయిందే" అనికొందరు జాలిపడ్డారు. "ఆ అధ్వాన్నపు పల్లెటూరికి మళ్లీ ఎందుకు తీసుకపోతావయ్యా—ఇక్కడే ఏదోవిధంగా నయంచేయించుకోకుండా. ఎందుకన్యాయం చేసుకొంటావయ్యా—రత్నంవంటి పిల్లవాణ్ణి" అని కొందరు అన్నారు.

వాళ్లు దిగవలసినచోటు వచ్చింది. బస్సు ఆగింది. నిర్దయుడై గ్రీష్మసూర్యుడు తనచండకిరణాలను మరింత తీక్షణంగా పరపుతున్నాడు. భారంగా బాబును అశ్రువులతో దించుకొన్నారు. తండ్రి బాబును తన భుజంమీద జాగ్రత్తగా పండుకోబెట్టుకున్నాడు. తల్లి బిడ్డకు ఎండతగలకుండా జాగ్రత్తగా గుడ్డకప్పింది. బస్సుఆగేచోటు నుంచి ఆకాలిబాట వంకరలుతిరిగిదుష్టకాలసర్పంవలె ఆ చిట్టడవిలోనుంచి ఆ నిర్దయ

జనపదంలోకి తీసుక వెళ్లుతోంది. ఎండలో నడుస్తూన్న వాళ్లకళ్లముందు చీకట్లు సుళ్లు తిరుగుతున్నాయ్! అశ్రువులు స్రవిస్తూ వుండగా శరీరాలు దుర్బలంగా వణకిపోతున్నాయ్. దారిద్ర్యంవల్ల తిండిలేక అసలే దుర్బలమైన వారి శరీరాలు ఈ దుఃఖ శ్రమభారాన్ని మోయలేక పోతున్నాయి. ఐనా నిర్దయగావాళ్లు తమ శరీరాలను బలహీనమై చెడిపోయే స్థితిలోవున్న యంత్రం చేత భారమైన పనిని చేయిస్తున్నట్లు నిర్దయగా నడిపిస్తున్నారు. ఎటు చూచినా ఎవరూలేరు. అంతా చిట్టడవి. ఎక్కడా నీడను ప్రసాదించగలవృక్షమే లేదు. అన్నీ కలేచెట్లు, రేగుకంపలు. వాళ్లనాలుకలు విరుచుకపోతున్నాయి. బాబు కోసం మాత్రం మరచెంబులో కొద్దిగానీళ్లు ఉన్నాయి. ఆగి అప్పుడప్పుడూ బాబుకు గొంతుతడుపుతూ ఉన్నారు. నిరాశతో, దుఃఖంతో, శ్రమతో చేస్తున్నవాళ్ల యీ ప్రయాణం వాళ్ల జీవనయాత్రకు చిహ్నం వలె ఉంది.

అతనికి తన జీవన దురదృష్టగాథ అంతా జ్ఞాపకానికి వస్తూంది. తనకు తనతాత బోలెడంత ఆస్తిని యివ్వగా తనకు పోషకురాలైన పినతల్లి పెంచడానికి తీసుకపోవడమూ, పినతల్లి భర్త ఆ ఆస్తినంతా దిగమ్రింగి తనపేర ఇల్లూ పొలాలూ ఏర్పరచుకోటమూ, చదువూ సంధ్యా సరిగా అబ్బనివ్వకుండా ఇంటినుండి తరమటమూ, ఏ ఉద్యోగానికీ అవకాశము లేకుండా పోవటమూ, ఉద్యోగాశ చూపి ఎంతో మంది లంచాలు కాజేయటమూ, ఇంకా ఎన్నో ఎన్నో.... అన్నీ జ్ఞాపకానికి వస్తూన్నాయి.

వాళ్లకు ఈ ప్రపంచంలో ఏ ఆశాలేదు. తమ యీ బిడ్డలయందలి ఆశతో జీవిస్తున్నారు. అతడు ఒకరోజు తనబాబును గూర్చి ఆశపడ్డాడు. ఇంత చిన్నతనంలోనే సాహసాన్ని చూపుతున్న తన విజయకుమార్ ఒకనాడు దేశానికి ఉపయోగపడే సాహసోపేతుడౌతాడని ఆశపడ్డాడు. ఎంత జీవనావేగాన్ని, ధైర్యాన్ని బాల్యంలోనే చూపుతున్నాడు బాబు! దారిద్ర్యం మన దేశంలో యిలాంటి రత్నాల్ని ఆదిలోనే త్రుంచివేస్తోంది.

నిప్పులు కక్కుతోన్న ఆ ఎండలో నాలుకలు విరుచుకపోతున్నా, తలలూ పాదాలూ మాడిపోతున్నా ఆ బాటనే వాళ్లు తూలుతూ సోలుతూ దుఃఖమూ, నిరాశా తోడుగా పడిపోతూ ఉన్నారు. తమ బాబు జీవించే ఆశ వారికిలేదు. ఈ దారిద్ర్యాన్నీ, దుఃఖాన్నీ భరించి తాము బ్రతికే ఆశ తమకూలేదు. తమ చిన్నపిల్లవాని ముందుగతేమో ఊహించటానికే భయపడి పోయూరు. ఎటుచూచినా అంతా అగమ్యగోచరం.

# ఆంధ్ర రాష్ట్రము

శ్రీమతి వంగల వాణీబాయిగారు

౧

ఆంధ్ర రాష్ట్రము-ఎప్పుడొచ్చునా. యనియంచు
  గగ్గోలుచేసిన - ఆంధ్రులార
ఆంధ్ర రాష్ట్రము-మనకు-మేలు-చేయునని
  ముదము పొందినట్టి - ఆంధ్రులారా
మనరాష్ట్రమేఉన్న-మనలోన-మనకు
  ఐయికమత్యము-గలదన్న-ఆంధ్రులార
    రెండు-లేవండ్రు-మీకోర్కె-సఫలమాయె
    ఆంధ్ర రాష్ట్రము-మనకబ్బె-వేడ్క మీర
    చేతిబిడ్డవంటి-ఆంధ్రరాష్ట్రమును
    పాటుపడి-సాకుడీ-ఆంధ్రులారా ||

౨

ఆంధ్రనాయకులెంతో-ఓరిమితోకూడి
  కృషిచేసి-తెచ్చిన-రాష్ట్రభూమి
తర్క-వితర్కముల-గడుచాక చక్యముతో
  సాధించి-తెచ్చిన-రాష్ట్రభూమి
రాజధానికొరకు-వైరముల్-రాకుండ
  నేర్పు ప్రజ్ఞతో-కొన్న-ఆంధ్రభూమి
    అట్టి రాష్ట్రము మనకబ్బె-వేడ్క మీర
    కాలుసాచుకు-కూర్చుండు-వేళ కాదు
    క్రొత్తగా దొరకిన-ఆంధ్రరాష్ట్రమును
    స్త్రీలు, పురుషులు, బిడ్డలందరును చేరి
    నడుములు బిగించి-వృద్ధిపొందించురీతి
    పాటుపడి-కీర్తి-తెప్పించుడీ-ఆంధ్రులార ||

౩

విజయవాడేగాని-రాజధానికి-గాను
  పనికిరాదన్నారు-చాలమంది
తిరుపతైతేగాని-ఒప్పుకోమని-ఎంతో
  దృఢముగా-కొందరు-పోరులనిరి
ఇదికాదు-అదికాదు-వాత్తెరు
  పెద్దరేవంచు-కోరిరి-కొంతమంది
    నెల్లూరు-గుంటూరు-రాజమండ్రులు
    ఎవరి ఊర్లను వారల్లె-కోరుకొనిరి
    ఎట్టకేలకు-ఎల్లెట్లో-తీర్పుకొచ్చి
    ఏరుకొన్నారయా-కర్నూలు-రాజధాని ||

౪

పెద్దవాడును-ఆంధ్రనాయకుడైనట్టి
  ప్రకాశమును-గన్న-ఆంధ్రభూమి
సర్వశాస్త్రములలో-నుత్తముడైనట్టి
  రాధకృష్ణయ్య-పుట్టిన-ఆంధ్రభూమి
ఆంధ్రరత్నమని-బిరుదుగన్నట్టి-పట్టాభి
  మన తెల్గువాడు-గాదె!
ఆడువారిలో-ఏమి-తక్కువా, అన్నట్లు
  దుర్గబాయమ్మ-మన-బిడ్డ-కాదె!
    ఆచార్యరంగా-గోపాలరెడ్డియు
    గిరిగారునూ-మనవారు కాదె!
    ఇట్లు ఎందరోగలరు-దేశోపకార్లు
    పేర్లుఎంచుట-కష్టసాధ్యంబు కాదె
    వీరులనుగన్న-ఆంధ్ర తల్లికి-జోహారులివిగో ||

౫

భళి-భళి-ఆంధ్ర రాష్ట్రముకు
వీరులు-పెద్దలు-నాయకుల్
మహాగణికుల గన్నయట్టి
మనదేశము-ఆంధ్రుల-పుట్టినిల్లు
జయమగుగాక-నీకు-శుభ
మంగళమౌనిక-ఆంధ్రదేశమా !

౬

మంగళము-మంగళము-మా తెలుగుతల్లీ
మంగళము-మంగళము-మా ఆంధ్రభూమీ
జయమంగళము-మా-నూత్న రాష్ట్రముకు
ఆంధ్రరాష్ట్రముకు-జోహారులివిగో ||



# విండర్ మియర్‌సతి విసనకర్ర

రచయిత : ఆస్కార్ వైల్డ్

అనువాదం : సో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.

(ఆగస్టు నెల తరువాయి)

విం.స–:అది ఇవేళ ఇక్కడికిరాదు.

వి.ప్ర:–మిసిస్ ఎర్లిన్ ఇక్కడికి వస్తుంది, నీవు ఆ విడ కేవిధమైన మనస్సంకటమూ కలిగిస్తే మనిద్దరికీ తీరని అవమానం కలిగించిన దానివౌతావు. జాగ్రత్త! నన్ను నమ్ము. భార్య భర్తని నమ్మాలి!

విం.స:–లండనులోఉన్న స్త్రీలంతా వాళ్ల వాళ్ల భర్తల్ని నమ్ముతూనే ఉన్నారు. వాళ్ళని చూడగానే మనం ఇట్టే పోల్చుకోగలం. వాళ్ళు ఎప్పుడూ దిగాలుపడి ఉంటారు. నేను వాళ్ళలో ఒక దానిగా కాదలచలేదు. (ముందుకు కదిలి) డార్లింగ్టన్ ప్రభూ, నా విసనకర్ర ఇస్తారా? ధన్యవాదాలు. విసనకర్ర చాలా ఉపయోగిస్తుందికదూ? ఇవేళ నాకో మిత్రుడు కావాలి. ఇంత త్వరలో నాకో మిత్రుని అవసరం ఉంటుందని నేను ఇంతవరకూ అనుకోలేదు.

డార్లింగ్టన్ ప్రభువు –ఆ సమయం ఎప్పుడో ఒకప్పుడు వస్తుందని నాకు తెలుసు. కాని ఇవేళరాత్రే రావలసిన అవసరం?

విం.ప్ర:–నేను ఆమెకు చెబుతా, చెప్పి తీరాలి. ఏవిధమైన రభసా జరగడం అంత సభ్యంగా ఉండదు మార్గరెట్.

సా –మిసిస్ ఎర్లిన్!

విండర్‌మియర్‌సతి కంగారుపడుతుంది. చక్కని ముస్తాబుతో ఠీవిగా మిసిస్ ఎర్లిన్ ప్రవేశిస్తుంది. విండర్‌మియర్‌సతి విసనకర్రని గట్టిగా పట్టుకుంటుంది. తమపరి దానిని కింద జారవిడుస్తుంది. మిసిస్ ఎర్లిన్‌వైపు చీకాకుతో తల పంకించి, గది లోకి వెళ్ళిపోతుంది. మిసిస్ ఎర్లిన్ చిరునవ్వు చిందులాడే ముఖంతో ప్రతి నమస్కారం చేస్తుంది.

డా.ప్ర:–ఏమండీ, మీరు విసనకర్ర జారవిడిచేరు.

[కిందనున్న దానిని అందుకుని ఆమెకు అందిస్తాడు]

మిసిస్ ఎర్లిన్:–విండర్‌మియర్ ప్రభూ, కులాసాగా ఉన్నారా? మీ భార్యగారు భలే అందంగా ఉన్నారు సుమా! నిజంగా బొమ్మలాగే ఉన్నారు!

విం.ప్ర:–(తగ్గుగొంతుకతో) మీరిక్కడికి తొందరపడి వచ్చారు సుమా!

మి.ఎ:-(చిరునవ్వు) ఇంత కాలానికి ఇదో కటే చాలా తెలివైనపని. నా విషయమై కాస్త శ్రద్ధ తీసుకోవాలి. నాకు ఆడవాళ్ళంటే భయం,-వాళ్ళలో కొంత మందితో మీరు నాకు పరిచయం చెయ్యాలి. మగవాళ్ళని ఎలాగో వోలాగ లొంగదీసుకోగలను. అగస్టస్ ప్రభూ, కులాసాగా ఉన్నారా? ఈ మధ్య నన్ను మరిచిపోయినట్లున్నారు నిన్నటినుండి మిమ్మల్ని చూడనేలేదు. మిమ్మల్ని నమ్మలేను. మిమ్మల్ని నమ్మడం కష్టమని ప్రతీ వారూ అంటున్నారు.

అగస్టన్ ప్రభువు:-కారణం చెబుతా వినండి.

మి.ఎ:-మీరేదీ సరిగ్గా చెప్పలేరు. అదే మీలోఉన్న సౌమ్య గుణం!

అ.ప్ర:-నిజంగా నాలో అంత సౌమ్యగుణం ఉంటే—

వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూ ఉంటారు. మిసెస్ ఎర్లిన్ వైపు దృక్కులు సారిస్తూ విసుగుతో ఇటూ అటూ తిరుగుతూ ఉంటాడు విండర్ మియర్ ప్రభువు. డార్లింగ్టన్ ప్రభువు (విండర్ మియర్ సతితో) అలాగ నిశ్చేష్టులైయున్నారే?

విం.స:-పిరికివాళ్లెప్పుడూ నిశ్చేష్టులుగానే ఉంటారు!

డా.ప్ర:-మీరు దిగాలుగా ఉన్నారు. డాబామీదికి వెడదాంరండి.

వి.స:-ఔను. (పార్కర్‌తో) పార్కర్! నాపొడుగుకోటు పైకిపంపు.

మి.ఎ:-(ఆమెవైపుకదిలి) విండర్ మియర్ సతిగారూ, మీ డాబా దేదీప్యమానంగా వెలుగుతుంది. దీనిని చూడగానే రోములోని డోరా రాజకుమారిభవనం జ్ఞప్తికి వస్తుంది.

[విండర్ మియర్ సతి నిశ్శబ్దంగా తలఊపి, డార్లింగ్టన్ ప్రభువుతో వెళ్లిపోతుంది.]

ఏమండోయి గ్రహాంగారూ, కులాసాగా ఉన్నారా? ఆవిడ మీ మేనత్త జెడ్బరో సతిగారేకదూ? నన్ను ఆమెతో పరిచయపరుస్తారా?

సిసీల్ గ్రహాం:-(కాస్తసేపు తటపటాయించి) ఆహా తప్పకుండా కేరొలిన్ అత్తా, ఈ విడ మిసెస్ ఎర్లిన్‌గారు.

మి ఎ:-మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషిస్తున్నాను. (ఆమె పక్కని సోఫాలో కూర్చుంటుంది) మీ మేనల్లుడు నాకు చిరపరిచితులు. ఆయన ఆరితేరిన రాజకీయవేత్త - టోరీలాగ యోజించి, రేడికల్‌లాగ మాట్లాడతారు; అదే ఈ కాలంలో ముఖ్యంగా చెయ్యవలసినపని. ఆయన చాలా చమ

త్కారంగా మాట్లాడతారు. ఈ గుణాలన్నీ ఆయనకి ఎవరి దగ్గిరనుండి అబ్బేయో మాకు బాగా తెలుసు. అల్లడేంల్ ప్రభువు నిన్న సాయంత్రమే పార్కులో అన్నారు గ్రహాంగారు ఇంచుమించుగా వాళ్ళ మేనత్త అంత చక్కగా మాట్లాడుతున్నారని.

జెడ్ బరోసతి:-అదంతా మీ సదభిప్రాయమే!

[మిసిస్ ఎర్లిన్ చిన్న గానవ్వి, సంభాషణ సాగిస్తుంది]

డంబీ:-(సిసీల్ గ్రహాంతో) మిసిస్ ఎర్లిన్ని జెడ్ బరోసతికి పరిచయపరిచేవా?

సిసీల్ గ్రహాం:-పరిచయపరచక తప్పింది కాదు. ఆ విడ ఒకటి కావాలంటే మనం దానిని నిరాకరించలేం. అదే ఆమెలోని అనన్య సామాన్యమైన గుణం.

డంబీ:-ఆమె నాతో మాట్లాడకుండా ఉంటే చాలు అదే పదివేలు!

[ప్లిండేల్ సతివైపు వెడతాడు]

మిసిస్ ఎర్లిన్:-(జెడ్ బరోసతితో) లక్షీవారం నాడే కదూ! సరే. (లేచి నవ్వుతూ విండర్ మియర్ ప్రభువుతో మాట్లాడుతుంది) ఈ ముసలమ్మలతో మాట్లాడకపోతే వాళ్ళకి చీకాకుగా ఉంటుంది. వాళ్ళతో మాట్లాడడానికి మనకు చీకాకుగా ఉంటుంది.

ప్లిండేల్ సతి:-(డంతో) విండర్ మియర్ తో మాట్లాడుతుంది చూసేరూ, చక్కగా ముస్తాబైయున్న ఆ వ్యక్తి ఎవరు?

డం:-నాకెవరో బొత్తిగా తెలీదు. ఫ్రెంచి శృంగార గ్రంథాలకి అనువయ్యే బొమ్మలాగుంది; ఇంగ్లీషు బజారుకి సరియైన సరుకే.

మి.ఎ:-అదిగో డంబీగారు ప్లిండేల్ సతితో మాట్లాడుతున్నారు. ఆమె అతనిని ఒక నిమిషంకూడా విడిచిపెట్టేటట్లుగా లేదే. అతడు నావైపే చూడటం లేదు. ఆ విడంటే భయంకాబోలు. ఈ పచ్చపచ్చని స్త్రీల గుణాలు ఏమీ స్థిమితంగా ఉండవు. నేను మీతో మొట్టమొదట డ్యాన్సు చెయ్యాదలిచేను, ఏమంటారూ విండర్ మియర్ ప్రభూ (విండర్ మియర్ ప్రభువు కోపంతో పెదవి కొరుకుతాడు) అది చూడగానే అగస్టస్ ప్రభువు అసూయ పడకమానరు.

అగస్టస్ ప్రభూ! (అగస్టస్ ప్రభువు అటు వస్తాడు) విండర్ మియర్ ప్రభువుగారు మొట్టమొదట నేను ఆయనతో డ్యాన్సు చెయ్యాలని పట్టుపడుతున్నారు. ఇది ఆయన ఇల్లు కాబట్టి నేను నిరాకరించ

లేకుండా ఉన్నాను. తర్వాత మీతో తప్పకుండా డ్యాన్సు చేస్తా.

అగస్టన్ ప్రభువు:-(తలపంకించి) అలాగే కానీయండి.

మి.ఎ:-మీరు చాలా నిపుణులు. మాతో జీవిత పర్యంతమూ నృత్యంచేసినా విసుగనేది ఉండనే ఉండదు.

అ.ప్ర:-(తన తెల్లని వెయిస్ట్‌కోటుమీద చేతినిఉంచి) ధన్యవాదాలు. మీ గుణం నిజంగా వర్ణనాతీతం!

మి.ఎ:-ఎంత చక్కని మాటలు, ఎంత నిరాడంబరం, ఎంత అమాయకత! అటువంటి మాటలంటే నాకు చాలా యిష్టం. ఇదిగో నాయీబొకే మీరు పట్టుకోండి. (విండర్‌మియర్ ప్రభువు చేతినానుకుని బాల్‌రూమ్‌వైపు వెళుతుంది, ఓహో, డంబీగారా? కులాసాయేనా? మీరు నాయింటికి మూడు సార్లు వచ్చేరని విన్నాను. ఒక్కసారీ నేను ఇంట్లో లేనందుకు చాలా విచారిస్తున్నాను. శుక్రవారం నాడు మధ్యాహ్నం భోజనానికిరండి.

డంబీ (ఏవిధమైన ఉత్సాహం కనబరచక) తప్పకుండా ప్లింజేల్‌సతి డంబీవైపు కొరకొర చూస్తుంది. అగస్టన్ ప్రభువు బొకేతో, మిసిస్ఎర్లిన్ విండర్‌మియర్ ప్రభువుల్ని అనుసరిస్తాడు బాల్‌రూమ్‌లోకి.

ప్లింజేల్‌సతి:-(డంబీతో) మీరెంతవంచకులు? ఇకమీదట మీమాట ఒకటి కూడా నమ్మను. ఆవిణ్ణి తెలీదని ఎందుకు బొంకేరు? మూడుసార్లు దానింటికి పరుగుపరుగున వెళ్లడమా? మీరక్కడికి మధ్యాహ్నం భోజనానికి వెళ్లడానికి వీలులేదు తెలిసిందా?

డం:-వారా, నేను అక్కడికి వెళ్లనేవెళ్లను.

ప్లిం.స:-ఇంతకీ దాని పేరేమిటో మీరు చెప్పలేదు. దాని పేరేమిటి?

డం:-(కొద్దిగాదగ్గి, జుట్టు సర్దుకొంటూ) ఆవిడ మిసిస్ఎర్లిన్.

ప్లిం.స:-ఈ మనిషే.

డం:-అవును; అలాగనే ఆవిణ్ణి అందరూ పిలుస్తారు.

ప్లిం.స:-బలే తమాషాగాఉందే! బలే, బలేగా ఉంది! నేను దానిని బాగా పరికించి చూడాలి. (బాల్‌రూమ్ తలుపుదగ్గిరకెళ్లి లోపల తొంగి చూస్తుంది) ఈ మనిషిని గురించి నానా సంగతులూ విన్నాను. పాపం విండర్‌మియర్‌గారు దీని వలలో పడ్డారట. సత్ప్రవర్తనకి ఆలవాలమైన విండర్‌మియర్‌సతి దీని ఆహ్వానించడమే! చాలా తమాషాగాఉంది! అంత మంచావిడ ఇలాటి పాడుపని చెయ్యడమా? వచ్చే శుక్రవారం మీ మధ్యాహ్న భోజనం అక్కడేగా?

(సశేషము)



# భగ్న జీవులు

శ్రీ కాళ్లకూరి నరసింహారావు

ఆ చిన్న పూరింట్లో దీపం మిలమిలలాడుతోంది. సీతాకాలం! రాత్రి సుమారు 7 గం॥లు దాటింది. రామం చిన్నబోయిన ముఖంతో, మెల్లిగా కాళ్లీడ్చుకుంటూ యింటికి చేరాడు. అతని కోసమే యెదురు చూస్తూన్న శ్యామల, అతడు రాగానే "ఎక్కడైనా, యేమైనా దొరికిందా" అని ఆతృతగా అడిగింది. ఈ మాట చెవిని పడగానే మండుతున్న గాయానికి కారం రాచినట్లయిందతనికి. ఆమె ప్రశ్నకి ఒక్క దీర్ఘ నిట్టూర్పు కంటే యేమీ సమాధానం యివ్వలేక పోయాడు. అతని మొహం చూడగానే శ్యామల అర్థం చేసుకుంది.

"అయ్యో! యివ్వాళ అప్పైనా యెక్కడైనా దొరక్క పోతుందా, తెస్తారు, అని గంపెడాసతో కూర్చున్నాను. పాపాయి పాలు లేక కక్కటిల్లి పోతున్నాడు. మీరు నిన్నటి నుండీ పస్తు, నాకు మూడురోజులునుండి ఆహారమే లేదు."

"శ్యామలా, నువ్వు మూడురోజులనుండి పస్తుపడుకున్నావా?"

"ఉన్నది మీకు పెట్టి నేను మంచినీళ్లతో రోజు గడుపుతున్నాను"

"అయ్యో, శ్యామలా, నువ్వు యీ నిర్భాగ్యుణ్ణి పెళ్లి చేసుకోక పోయినా అదృష్టవంతురాలవయ్యేడిదానవేమో"

"ఆ మాటే మిమ్మలననవద్దని వందసార్లు చెప్పాను. మీరు మాత్రమేమి చేస్తారు, B. A. ప్యాసయ్యారు. కష్టపడి ప్రతివాడి చుట్టూ వుద్యోగం కోసం తిరుగుతున్నారు. బదులడుగుదుమేమో అని స్నేహితులు కూడ మొగముచాటు చేయుచున్నారు. మనకర్మమిట్లుండ నొకరిననుకొనుట యేల......"

"ఏమి చేయను శ్యామలా, యీ సర్టిఫికట్టు తీసుకుని ప్రతి ఆఫీసుకీ తిరిగాను. ప్రతి ఆఫీసరు కాళ్లూ పట్టుకున్నాను. కాని యెక్కడకు వెళ్లినా యీ లంచ లమారి రోజుల్లో మన మొహం చూసే వాడు లేడు. దక్షిణ మట్టు చెపితేనే గాని దర్శనం కూడా కాదు. పిల్లాడి పాలకి చేతులో కాని లేని మనం యీ పిశాచ హృదయాలనియెల్లా సంతృప్తి పరచగలం? అంచేత ఎచ్చటకు వెళ్లినా 'No Vacancy' అనే బోర్డులే, 'కాళీ లేదు,' అనే మాటలే వినిపిస్తున్నాయి."

"మీరీవిధంగా కష్టపడుతుంటే నేచూడలేనండీ, పైన భగవంతుడున్నాడు. యీ పూరియిల్లు తాకట్టు పెట్టండి. ఆ రామిసెట్టి యేమైనా యిస్తాడేమో కనుక్కరండి"

ఈ విధమగు నిస్పృహతో కూడిన ఒక నిశ్చయానికి వచ్చి, నిరాశతో నీర్సంతో, నిస్పృహతో, పస్తులో ఆ రాత్రి ఆదంపతులు నిద్రాదేవిఒడిలో సొలిపోయారు. మరునాడు రెండుజాముల ప్రొద్దెక్కినది. ఆ పూరియింటికి మునుపే యేమైన ఋణకాలున్న వేమోనని భయపడి రామిసెట్టి అప్పీయనిరాకరించెను. ఏమి చేయుటకును తోచక రాముడు మోచేతికి తల నానుకొని ఆలోచించుచుండెను. ఇంతలో గుడ్డ వుయ్యాలలోని పిల్లడు యేడుపువిని, శ్యామల పిల్లవాని నెత్తుకుని రామం వద్దకు వచ్చెను. పిల్లవాడు బాగా చిక్కి నీర్సంగా, సన్నగా, వున్నాడు. ప్రక్క యెముకలన్నీ సులభంగా లెక్కపెట్టవచ్చు. కళ్లు గుంటలడి ప్రాణాలు

కళ్ళల్లోవున్నాయి. రామం పిల్లవాణ్ణి చూచి చాటుగుండా ఒకకన్నీటిచుక్క విడిచాడు.

శ్యామల పిల్లాణ్ని చూపిస్తూ "నా దగ్గరపాలు లేవు. పిల్లాడంతకంతకి నీర్సపడి పోయాడు, చూడండి డబ్బాపాలైనా పోద్దామంటే మనలను భగవంతు డనుగ్రహించడైనా."

"శ్యామలా, యేంచెయ్యను. నిరుపయోగకరమైన B. A. పట్టాకోసం సుక్షేత్రమైన పిత్రార్జితం తగలెయ్యకపోతే యీ నాడు నా బిడ్డడికీ స్థితి కల్గించక పోయేవాడిని"

ఈలా మాట్లాడుతుండగానే శ్యామల చేతిలోని పిల్లాడు కండ్లు తేలవైచాడు. చైతన్య రహితుడైన పుత్రుణ్ణి చూడగానే కెవ్వునకేకపెట్టి యేడుస్తూ శ్యామల "చూడండి, పిల్లాడివళ్లు యెలా చల్లబడిపోయిందో. ఎక్కడికేనా వెళ్లి త్వరగా డాక్టరును తీసుకరారూ?"

ఆ మాటలు చెవినిపడగానే రామం వీధిలోకి ఒక్క పరుగుపెట్టి దగ్గరలోనేవున్న ఒక డాక్టరును తీస్కువచ్చాడు. గుండె వాడి చూచి డాక్టరు ముందుగా బలానికి ఒక యింజక్షనివ్వాలనీ 8 రూ అవుతుందనీ ఖచ్చితంగా చెప్పివెళ్ళిపోయాడు. శ్యామల రామారావునిచూచి ఆతృతగా స్నేహితులెవరినైనా అడిగి త్వరగా యింజక్షను కొనుక్కురారూ?" అంది. వెంటనే రామం ముఖ్యంగా అడగవలసిన అందరినీ యెంతో ఆశతో అడిగాడు. ఇటువంటి పరిస్థితులలో పాపం ధనవంతులకి కళ్లుతప్ప చెవులు సమూలం వినిపించవు. ఒక్కరూ ఇతనిపరిస్థితి గ్రహించలేదు. గ్రహించవలసిన అవసరం వాళ్ళకేం? వారింటిలో బిడ్డ కాదుగా? ఒకరు దగ్గరలేదనీ, పెద్దనోటుకు చిల్లరకాయితాలు లేవనీ, మరొకరు యిప్పుడే యెవరికో యివ్వాలని యిచ్చివేసామనీ. యీ విధంగా అందరూ తప్పుకున్నారు. రామానికి గత్యంతరం ఏమీ తోచలా. తిన్నగా తిరిగ్తిరిగ్ బజారురోడ్డుకువచ్చాడు. మిట్టమధ్యాన్నం రెండుగంటలు దాటింది. అక్కడే యింపీరియలు బ్యాంకి వున్నది. ఆ బ్యాంకులో అప్పుడే చెక్కు మార్చుకుని వెడుతున్న యెలిమెంటరీ స్కూలు మేష్టారు వెడుతు కనిపించాడు. ఆయనకు వయసుమళ్లింది. అతనిచేతిలోని నోట్లు రామం కళ్లలో తళుక్కున మెరిశాయి. అతని మీదపడి పోదామా అనిపించింది. కాని వివేకం తలెత్తింది. ఇంతలోనే తన ముద్దుబిడ్డ పరిస్థితి జ్ఞాపకమొచ్చింది. శ్యామల మాటలు చెవులో గింగురుమన్నాయి. తోడనే రామం పిచ్చివాడైపోయాడు. ఉద్రేకంలో ప్రక్కనున్న బీటుపోలీసు నన్నా చూడకండా ఆ మేష్టరుమీదపడి, పీకనులిమి ఆ నోట్లులాక్కున్నాడు. తోడనే పోలీసు విజిల్సు మారుమ్రోగాయి. మరు క్షణంలో రామం నల్గురు పోలీసుల మధ్య బందీగా నున్నాడు.

మరునాడు ....ముసలి మేష్టార్ని హత్యచేసి నందుకు రామానికి వురిశిక్షపడింది. ఈ మాట వినగానే, అసలే అంతక్రితమే పోయిన పుత్రుణ్ణి పక్క పెట్టుకుని యేడ్చి, యేడ్చి, నీర్సంగా పడివున్న శ్యామల గుండె ఆగిపోయింది. పాపం ఆ భగ్నజీవులనుగూర్చి, మనకఠిన, కర్కశ, శిలా, హృదయాలు గల మానవ సంఘం, ఒక్క కన్నీటి చుక్కైనా రాల్చక పోవడమే కాకుండా, పైగా 'పాపఫలితం వూరికేపోతుందా? దుర్మార్గుడు. ఆ ముసలి మేష్టరు వుసురు పోసుకున్నాడు"! అనుకుంది.

"నన్నూ, నాకుటుంబాన్నీ, యీ అధమావస్థకి తెచ్చింది మీరుకారూ?" అని సంఘాన్ని ప్రశ్నిస్తున్నట్లుగా చూస్తూ, వేళ్లాడుతోంది రామం తలకాయ, ఆ వురికంబంమీద.



# కరణంగారి యుక్తి

శ్రీ పోలాకి
శ్రీనివాసరావు

కరణంగారి హయాంలో అనుక్షణం గ్రామస్థులను ఆరాటం కలిగిస్తూనే ఉంటుంది. ఎప్పుడేమి పోజిరీ వ్రాతలు కల్పిస్తారో, ఎవరెవరి జుట్లకు ముడులు పెట్టాలని తలుస్తారో అని ప్రజలంతా హడలై తల్లడపడుచునే ఉంటారు. కరణంగారి యింట్లో చావటానికి ఘడియలు లెక్కించుకుంటూన్న ముసలి గోవు ఒకటి వుంది. అది చస్తే రెండు మూడు రూపాయలు వెచ్చించి దొడ్డినుండి యీడ్పించి పూడ్పించాలి. కరణంగారు కర్తవ్యం ఆలోచించారు. నౌకరును పిలిచి "ఓరీ పౌరోహితుణ్ణిలా పిలుచుకొనిరా!" అని చెప్పారు. నౌకరు పౌరోహితునివద్దకు పోయి కరణంగారు పిలిచారని తెలియజేశాడు. కరణమేమి నెత్తిని వేస్తాడోనని తహతహలాడుతూ కరణంగారిని దర్శించాడు పౌరోహితుడు.

"అయ్యా! నేను గోదానం చేస్తున్నాను. దాన్ని మీరు పొందాలి!" అని ఆజ్ఞాపించాడు కరణం. పౌరోహితుడు విషయాన్ని అవగతంచేసుకొని బదులు పలుకలేక బద్ధుడయ్యాడు. ప్రాణావసాన దశలోనున్న గోవును ఒక రూపాయి దక్షిణతో దానాన్ని ప్రతిగ్రహించాడు. కరణంగారి నౌకరును సహాయం తీసుకొని ముప్పతిప్పలుపడుతూ గోవును తన యింటికడకు చేర్చాడు పౌరోహితుడు. ఆ క్షణాన్నే పౌరోహితుని పశువులదొడ్లో కండ్లు మూసిందా దానం పొందిన గోవు. తిండికి లేక పస్తులు పడుతూన్న ఆ పేద పౌరోహితుడు విచారిస్తూ ఇంటిలోనున్న పాత్ర సామానులను కుదువబెట్టి రెండు రూపాయలను తెచ్చాడు. దానంలో దక్షిణగా గొన్న రూపాయితో కలిపి మూడు రూపాయలను కటికవాండ్రకిచ్చి చచ్చిన యావును దొడ్డినుండి యీడ్పించి పూడ్పించాడు.

కొన్నాళ్ళకు కరణంగారికి కాలం సమీపించింది. కరణంగారు కన్నులు మూశారు. యమభటులు యమధర్మరాజుగారిచెంతకు తీసుకపోయారు కరణాన్ని. యముడు చిత్రగుప్తునిపిలిచి కరణం సంగతులను తెలియజేయమన్నాడు దండనలను విధించటానికి. చిత్రగుప్తుడు పుస్తకముతీసి పుటలు తిరుగవేస్తూ ఏకరువుపెట్టాడు కరణంగారు చేసిన పాపపుంజాలను. కరణం కండ్లెర్రజేశాడు. "ఏమయ్యా! కరణాన్ని కరణం నమ్మరాదన్న సామెతగా జాతి విరుద్ధం చూపుతూ నా పాపాలనే కొండల్లా కనపరుస్తూన్నావు. నేను పుణ్యాన్ని చేశాను, చిఠాతిరుగవేసి చూడండి చక్కా!" అన్నాడు. చిఠా తిరుగవేసి చిత్రగుప్తుడిలా అన్నాడు. "నీవు ఒక కృత్రిమ

గోదానం దక్క వేరేమి పుణ్యకార్యాలు చేసినట్టు లెక్కలలో కనుపించవు. ఆ గోదానమున్నూ పుణ్యకార్యంగా పరిగణింపబడదు. పాపాలకు తగిన శిక్ష అనుభవింపవలసినదే!'' – తను చేసిన గోదానానికి పుణ్యఫలంగా స్వర్గాన్ని చూట్టానికి అనుమతి నొసంగవలసినదని యమధర్మరాజును ప్రార్థించాడు కరణం. కరణం చేసిన గోలను కనిపెట్టి కనికరంతో సమ్మతించాడు యమధర్మరాజు. భటులను పిలిచి, కరణమునకు స్వర్గముచూపి తీసుకరావలసినదని ఆనతిచ్చాడు.

యమభటులు స్వర్గద్వారము సన్నిధికి తీసుక వెళ్ళారు కరణాన్ని. ''ఇక పోదాం! రా!'' అని పిలిచారు. ''అయ్యో! స్వర్గ ద్వారమును చూపారుకాని స్వర్గాన్ని చూడనివ్వటం లేదే! యమధర్మరాజుగారి ఆజ్ఞ అలా లేదే? స్వర్గాన్ని చూచి రమ్మన్నారు. కనుక నేను స్వర్గములో ప్రవేశించి స్వర్గాన్ని చూడవలసినదే! ఆటంకం చేయటానికి ఎవరు మీరు?'' అని గద్దించాడు కరణం. యమభటులు స్వర్గములో చొరటానికి వీలులేదు గనుక స్వర్గద్వారమువద్దనున్న స్వర్గభటులతో విషయమంతా చెప్పి వారికి కరణాన్ని అప్పగించారు. ''యమభటులకూ మీకూ చాలా వ్యత్యాసము వుంది. వారు మూర్ఖులు. మీరు చాలా మంచివా''రని స్వర్గభటులను మెప్పించి స్వర్గంలో ప్రవేశించాడు కరణం. కల్పవృక్షంవున్న ప్రదేశానికి వెళ్లాడు. కల్పవృక్షం ఏవికోరితే అవి సమర్పిస్తుంది కనుక ''ఓ కల్పవృక్షమా! బ్రహ్మ విష్ణు మహేశ్వరులను త్రిమూర్తుల సంతకాలతో ఓ కాగితమున్నూ, కలం సిరాబుడ్డీలును నాకు ప్రసాదించాలి!'' అని ప్రార్థించాడు. అట్లే కల్పవృక్షం సమర్పించింది. ఆ కాగితముపై నేదో కల్పించి సంగ్రహించుకొన్నాడు. కాలాతీతమగుచున్నందున స్వర్గభటులు కరణంగారిని పిలుచుకొనిపోయి యమభటుల కప్పగించారు.

కరణంగారు యమభటులతో యమధర్మరాజు సన్నిధికిజేరి మహాధైర్యంగా ''ఓ యమధర్మరాజా! గద్దె దిగుము. నీవు పాతయముడవు నేను క్రొత్త యముడను. ఇదిగో ఈ ఉత్తరువుచూడు''మని కాగితాన్ని చేతికందించాడు. యముడు తెల్లబోయాడు. చేయునదిలేక యమలోకాన్ని కరణంగారి స్వాధీనంచేసి త్రిమూర్తుల సాన్నిధ్యానికిపోయాడు. క్రొత్త యముడగు కరణం గద్దె నధిరోహించాడు. భటులనుపిలిచి చిత్రగుప్తునిరావించాడు. ''నా జాతివైరం నేను చూపుతూన్నా''నని చెప్పి చెరలో వేయించాడు చిత్రగుప్తుణ్ణి. ఇంక యమలోకములో యాతనలు పొందుచున్న పాపాత్ములకు దండనలనుండి విముక్తులుగా

జేసి తండోప తండములుగా స్వర్గానికి పంపుచున్నాడు. పాపులు పరమానందాన్ని పొంది క్రొత్త యమధర్మరాజుగారికి స్తుతి పాఠాలప్పగించారు.

పాత యమధర్మరాజుతో కలిసి త్రిమూర్తులు విచ్చేశారు యమలోకానికి. క్రొత్త యముడు కొంచెమేని భీతిచెందలేదు. త్రిమూర్తులు యిలా నన్నారు. "ఓయీ! నీవు మహా పాపివి. నీ కెవ్వరీ యమలోకమును గట్టినారు, నీవు తాంత్రికునివలె నున్నావే?" కరణం యిలా అన్నాడు "నేను మహాపాపినైతే మీ త్రిమూర్తుల దర్శనం నాకెలా లభిస్తుంది? మీ దర్శన లాభంపొందినవాడు మహాపుణ్యాత్ముడు. కనుక మీ దర్శనం పొందటంవల్ల మహా పుణ్యాన్ని సంపాదించినవాడనయ్యాను. ఈ పుణ్యాన్ని సంపాదించటానికే తంత్రములను పన్నినాను. మంచిఫల మనుభవించటానికి తంత్రములు పన్నితిని గనుక తప్పుగా పరిగణింపక మన్నింపవలసిన"దని ప్రార్థించాడు. త్రిమూర్తులు కరణంగారి యుక్తికి సంతసించి, వానిని స్వర్గానికి పంపివేసి పాతయమునకు తన లోకం తనకు స్వాధీనపరిచారు. పాతయముడు చిత్రగుప్తుని చెరనుండి విడిపించి, స్వర్గానికిపోగా మిగిలిన పాపాత్ములతో పూర్వమువలె పరిపాలన ప్రారంభించాడు.

---

ఒక యువకుడు తన భార్యతో విసుగుగా "ఇలాంటి తెలివి తక్కువవాళ్లనుచూచి బొత్తిగా సహించలేను" అన్నాడు.

"అయ్యోపాపం!! మీ అమ్మ మాత్రం చాల సహనంకలిగి యుండియుండాలి" అన్నది భార్య.

---

# శ్రీ కృష్ణ మహిమార్ణవము

## శ్రీ కే. యస్. కేసరిగారికి అంకితము.

శ్రీమతి దేశిరాజు భారతీదేవి

### కృష్ణుని కాలమున భారత దేశ పరిస్థితు లెట్లున్నవి?

(గతసంచిక తరువాయి)

### తృతీయ రంగము

మరునాడు తల్లి వంటజేసి పిల్లలకొరకై వేచియుండగా చిన్నపిల్లకమలవచ్చి 'మాకు నిన్నటికథను సాంతము చెప్పలేదేమమ్మా! అన్నయ్యవాళ్ళకు చాలా సేపు చెప్పినావు' అంటూ మారాము చేయసాగినది. 'ఉండవమ్మా! అన్నయ్యనుకూడా రానీ!' అంటూ వుండగా పెద్దపిల్లవాడువచ్చి 'అమ్మా! నాపని ముగించుకొనివచ్చినాను నిన్న అడిగిన నా ప్రశ్నకు సమాధానము చెప్పెదవా?' అని కూర్చున్నాడు. తక్కిన పిల్లలుకూడా చుట్టుమూగి కూర్చుండిరి. 'నీ ప్రశ్నయేమిటి? కృష్ణుని కాలమున కలహము లున్నవా అనియేగదా! అల్లరి చేయకుండా వింటె ఆ కథ చెప్పుతాను' అని కథ ప్రారంభించినది.

పూర్వము రాజు లెప్పుడు పరస్పర విజిగీషులై యుద్ధములలో మునిగి తేలుచునేయుండిరిగని అందరిని యేకచ్ఛత్రాధిపత్యక్రిందికి తేగల్గిన చక్రవర్తులుండిన కాలమున మాత్రము దేశము శాంతిగానేయుంటూ వుండెను. కాని కృష్ణుని కాలమున చక్రవర్తియని చెప్పదగిన వారెవ్వరులేరు. అందుచే రాజులు తమలో తాము కలహించుకొనుచునేయుండిరి. అట్టి ద్వాపరాంత సమయమున భారతదేశము రెండు పక్షములుగా చీలిపోయెను. రాజకీయముగా మాత్రమే గాక ఆధ్యాత్మిక మతవిషయములలో సయితము విరోధభావములు పరస్పర సంహారోద్రేకము లుత్పన్నమయ్యెను. వర్తమానకాలమున యూరపు, ఆసియా ఖండములవలె ద్వాపరాంత సమీపమున, మనదేశము విరుద్ధ ధర్మస్వభావ సంఘర్షణతో నుండెను. ధర్మ శాంత స్వభావులగు పాండవయాదవు లొకవంకను అత్యంత బలపరాక్రమోపేతులగు జరాసంధ, శిశుపాల, దంతవక్త్ర, కంసధార్తరాష్ట్రాదు లొక పక్షమునను జేరియుండిరి. ఇందొక పక్షము బలహీనమై రెండవపక్ష మత్యంత బలసంపన్నమైయుండెను.

శ్రీకృష్ణుడు బలహీనులపై పక్షపాతము వహించెను. ఆతడీయవతారమున తత్త్వవేత్తయై, మతబోధకుడై, రాజనీతిజ్ఞుడై, వీరుడై అమానుషశక్తి ప్రదర్శించి బలహీనులకు విజయము సాధించెను. గీతా గ్రంథమున పార్థునకు, తద్వారా లోకమునకు ఫలాపేక్షారహితముగా, తన ధర్మము ప్రతివాడును నిర్వర్తింపవలెనని బోధజేసెను.

బాలుడు:- అమ్మా!- కృష్ణుని కాలమున భారతదేశ పరిస్థితుల చెప్పుమని నేనడుగగా భగవద్గీతాబోధ చెప్పెదవేల?

తల్లి:- అదే చెప్పెదను. ద్రౌపదీ వివాహ ఘట్టమున భారతభూమిలో నేయేరాజు లేయే భాగమును పాలించుచున్నాడో తెలుపబడినది. భారత భాగవత గ్రంథములవలన శ్రీకృష్ణుడు కార్యరంగమున ప్రవేశించునాటికి ఈ క్రింది రాజ్యము లున్నట్లును, పాండవు లెవ్వరిని జయించి, తమకు లోబరచుకొన్నది తెలియుచున్నది.

పాండవ దిగ్విజయమున అర్జునుడు జయించిన ఉత్తర రాజ్యములు:- 1. కుళిందులు 2. సాల్వపురము 3. సునాభుడేలిన కటకదేశము 4. శాకవీద్వీపము 5. భగదత్తుడేలిన ప్రాగ్జోతిషము 6. రామగిరి 7. బృహంతుడేలిన కలూటరాజ్యము 8. వామదేవుడేలిన మోదాపురము 9. కాశ్మీరము 10. సింహ

పురము 11. దరధులు 12. యవన, కిరాతశాక, ఖర, కాచ, విభ్రకాదులు 13. యక్షకిన్నర గంధర్వాదులు.

భీముడు జయించిన తూర్పు రాజ్యములు:- 1. పాంచాల 2. విదేహ 3 దాశార్ణ (సుదర్మ యేలినది) 4. సుమిత్రుడేలిన పుళిందనగరము 5 శిశుపాలుని చేదిదేశము 6. శ్రేణిమంతుడేలిన కుమార దేశము 7. కోసలము 8. మల్ల 9. సుబంధుడేలిన కాశీ 10 మత్స్య 11 మాళవ 12. వత్స 13. గర్గ, నిషధ, దక్షిణ, మద్రరాజ్యములు 14. కుంభ, ప్రకుంభ, సముద్రరాజ్యములు 15. జరాసంధుని మగధరాజ్యము 16. కర్ణుడేలిన అంగ రాజ్యము 17. వాసుదేవుడేలిన 'పౌండ్ర' రాజ్యము 18. వంగ 19. తామ్రలిప్తకాశికుల రాజ్యము.

నకులుడు జయించిన పశ్చిమదేశములు:-1. మత్తమయూరకులు 2. మరుభూమి, బహుధాన్యక, శైరీశక రాజ్యములు 3. వివింధులు, వటధానులు 4. శిబులు, త్రిగర్తులు, అంబష్టులు, మాలవులు, కర్పటులు, మాధ్యమికులు 5. అభీరులు, రామఠకులు, హూణులు 5. శాల్యుడేలిన మద్రులు.

సహదేవుడు జయించిన దక్షిణ రాజ్యములు:- 1. శూరసేన 2. దంతవక్త్రుడేలిన అధిరాజ్యములు 3. కుంతిభోజుల రాజ్యము 4. మోక, పరమమోకులు 5. భీష్మకుడేలిన భోజకత 6. దక్షిణకోసల 7. వెన్నాకత 8. క్రాంతక, కాలకేయ హేరంబకులు 9. కిష్కింధ (సుగ్రీవుడేలినది) 10 నీలుడేలిన మాహిష్మతి 11. త్రిపుర 12. సౌరాష్ట్ర 13. గోశృగిరి, మురచిపుర, తిమిలింగల మున్నగునవి 14. బర్బరులేలిన భృగుకచ్ఛము 15. వనవాసులు అశ్మక, మూలకులు 16. పాండ్య, కేరళచోళులు 17. సింహళ ద్వీపము 18. విభీషణుడేలిన లంక.

కొ:-అమ్మా, యీ పేర్లన్ని మా హిందూదేశ చరిత్రలో లేవే!

తల్లి:- ఆ పేర్లిప్పుడే నామములతో నున్నవో, వాని విస్తీర్ణ, ఆకారములుచెడి అనేకము లోకరాష్ట్రములో చేరిపోయియుండును. రాజసూయాహవ సందర్భమున ధర్మజునితో శ్రీకృష్ణుడు భరత ఖండము రెండు రాజ్యకూటములుగా చీలియున్నట్లు చెప్పియుండెను.

అందొక కూటమునకు నాయకుడు మహాబలశాలి యగు జరాసంధుడు. అతడు మగధరాజు. అతడు 99 మంది రాజుల జయించి చెఱనుంచి మరియొక రాజును జయించిన పిమ్మట ఆ నూర్వుర నొక్కసారే రుద్రునకు బలియొసంగ నిశ్చయించెను. జరాసంధుడు కంసునిమామ. ఇతడు యాదవులకు ప్రబల శత్రువు. చేదిరాజగు శిశుపాలు డితని సేనాని-కరూశరాజగు వక్త్ర డితని తన గురువుగా నెంచెను. హంస, డిబికులితనికి సేనానులు - పాండురాజునకు మిత్రుడై పాండవులయెడ సానుభూతిగల భగదత్తుడు పయితము జరాసంధుని తనపై రాజుగా నంగీకరింప వలసివచ్చెను. శ్రీకృష్ణుని విరోధియై వంగరాజ్యమేలుచుండిన పౌండ్రక వాసుదేవుడు జరాసంధునితో సంధిజేసికొని యతని మిత్రవర్గములో జేరినందున అతడు యాదవులకు భయపడనక్కరలేక పోయెను. రుక్మిణీదేవి తండ్రియగు భీష్మకుడుగూడ జరాసంధునిమిత్రుడై తన యల్లునిపై వైరమూనెను. శిశుపాలునకు రుక్మి మిత్రుడైయుండెను. అంతేగాక దక్షిణ, తూర్పుదేశ రాజులనేకులు మగధరాజ్యాధికార మంగీకరించి సామంతరాజులైరి. అందుచేత భరత ఖండము తూర్పు సగము భాగమునకు జరాసంధుడే సామ్రాట్టుగా నంగీకరింపబడెను. అతడు పశ్చిమ భాగముననుండిన రాజులపై దాడిసాగింపజొచ్చెను. వారిలో ముఖ్యులు 1. ఉత్తర భోజులు 2. యాదవులు వంశములవారు 3. శూరసేనులు 4. భద్రకులు 5. యాధేయులు 6 పాటచ్చరులు 7. అగ్మకులు 8. కుండినులు 9 కాంతేయులు 10. పాంచాలురు 11. మాళవులు 12. మాత్స్యులు వీరందరు జరాసంధ రాజ్యకూటములచే నంతకంతకు పడమరకు

తరిమి వేయబడుచుండిరి. వీరందరకు నైకమత్యములేక రాజ్యకూటమని చెప్పదగిన స్థితిలోలేదు - వేయేల? శ్రీకృష్ణు సలహా సహాయములతో పాండవులు వీరి నందర నొకటిగాచేర్చి బలమైన రాజ్యకూటముగా జేయ ప్రయత్నించిరి. వీరందరు స్వార్థపరులై పరస్పర స్పర్థలుగలిగియుండుటచే పోరాటములలో జరాసంధ రాజ్యకూటములచే నోడింపబడుచుండిరి - కాని పాండవరాజసూయముతో వీరందరు నేకచ్ఛత్రము క్రిందికి చేర్చబడి పూర్వకూటస్థరాజులధాటికి నిలువ జొచ్చిరి.

ఈ దుర్ఘట కార్యమెట్లు జయప్రదముగా నిర్వర్తింపబడెనో యింతవరకు భాగవతమున చెప్పబడియున్నది. శ్రీకృష్ణుడవతరించునాటికి యాదవుల విరోధులగు రాజుల ప్రాబల్యం అధికముగానుండెను. కంసుడు మధురలోను, జరాసంధుడు మగధలోను పాలించుచుండిరి. యాదవులు నిరాశులై యేమియు జేయజాలక స్తబ్ధులై యుండిరి. పాండరాజెక్కడనో తిరుగుచుండెను. ఆ పరిస్థితులు చక్కబెట్ట సామాన్యులకు సాధ్యముగాదయ్యెను. శ్రీకృష్ణుడు ముందుగా జేయగల్గిన పనులు జయప్రదముగా జేసెను. శకట, బక, ధేనుక, అరిష్టులను దునుమాడెను. పిమ్మట అక్రూరునితో మైత్రిసల్పి ఆహుకునికూతు నాయక్రూరున కప్పించి పెండ్లిజేసెను. యాదవుల బాధించు కంసునిజంపి యుగ్రసేనునకు పట్టము గట్టించెను. కంసుని జంపిన కోపములో జరాసంధుడు 18 పర్యాయములు దండయాత్రజేసెనుగాని 17 పర్యాయము లోడిపోయెను. తుదకు 18-వ పర్యాయము మాత్ర మతడు యాదవులను ద్వారకవరకు తరిమివేయగల్గెను. అతని సేనానులైన హంస, డిబికులు 17-వ దండయాత్రలో శ్రీకృష్ణ బలరాములచే మడిసిరి. జరాసంధుని మిత్రుడు నరకుడుగూడ శ్రీకృష్ణునిచే సంహరింపబడెను. రుక్మి సయితము బలరామునిచే వధింపబడెను. పౌండ్రక వాసుదేవుడు కృష్ణునిచే సంహరింపబడెను. ఇట్లు పలువురు వీరులు చచ్చినను తూర్పురాజుల కూటబలము తగ్గలేదుకాని భీమునిచేతిలో జరాసంధుడు హతుడైన పిమ్మట తూర్పురాజుల కూటము విచ్ఛిన్నమై కూటబలము పటాపంచలయ్యెను.

పాండవరాజసూయముచే, పాండవులు సామ్రాజ్య పీఠ మధిష్ఠించుటకేగాక తూర్పురాజుల కూటములో మిగిలిన రాజులనెల్ల బరిమార్చుట కవకాశముగల్గెను. రాజసూయ యజ్ఞవేళ కృష్ణునకు లభించిన కీర్తి సహింపలేక కినుక వహించి శిశుపాలుడు కృష్ణుని దూషించుటచే నతడు వెంటనే సంహరింపబడెను. పిమ్మట వాని మిత్రుడు సాల్వుడు ద్వారకను ముట్టడించెనుకాని కృష్ణునిధాటి కోర్వలేక మృతిజెందెను. అంతటితో తూర్పురాజ్యకూట మంతరించెను.

అయినను కృష్ణుని కార్యభారము పూర్తిగా తగ్గలేదు. తనకు బంధువులై, మిత్రులై, అనుయాయులై, శిష్యులైన పాండవుల ననేక తెఱంగుల బాధలు పెట్టుచున్న ధార్తరాష్ట్రుల బారినుండి వారిని రక్షించుచు వారి నుద్ధరింపవలసినపని యింకను నిర్వహించవలసియున్నది. ఈ ధూర్తులగు ధార్తరాష్ట్రుల కడతేర్చి ధర్మజుని సింహాసనమున పునఃప్రతిష్ఠించుటవసరమైయున్నది. ఈ మహత్తర కార్యమాతడెట్లు నిర్వహించెనో భారతమున చక్కగా వర్ణింపబడియున్నది. ద్రౌపది గౌరవము సభలో భంగమొందకుండగా నిల్పి, పిమ్మట దుర్వాసుని బారినుండి పాండవులను తప్పించి, అరణ్యాజ్ఞాతవాసములలోను పిమ్మటను వారికి సహాయపడుచు, వారి పక్షమున రాయబారిగా పనిచేసి అది జయప్రదముకానందున పార్థసారథియై యుద్ధమున పనిజేసి కౌరవ క్షయము జేయించి పాండవులకు సంపూర్ణ విజయము సాధించి శ్రీకృష్ణుడు భూభారమును తన భారమును తొలగింపజాలెను. తూర్పురాజ్యకూట విచ్ఛిన్నముతో నొక పర్యాయమును, కురుపాండవ యుద్ధముతో రెండవమారును భరతఖండపటమును మార్చివేసెను. అంతటితో పాండవులకును ఇటు యాదవులకును బలము అధికారము భోగభాగ్య సంపదలు చేకూరెను. ఈ యధికార

లంపటతో విఱ్ఱవీగి యాదవులు తమలో తాము కల హించి కులనాశనము గావించుకొనిరి. కృష్ణనిర్యాణము సంభవించినది - కాని దేశమరాజకస్థితి నొందలేదు. పరీక్షితుని చండశాసనముతోగూడిన పరిపాలన శాంతకాలము సాగెను. జరాసంధ, సుదక్షిణాదుల పాషండశైవ మంతరించెను.

బా:- అమ్మా! అట్లు సర్వనాశన స్థితిగాంచిన భారత దేశము తిరిగి కోల్కొన్నదా లేక అటే నశించి పోయినదా!

తల్లి:- నాయనా! అధర్మప్రాబల్యముచే నాశనమైనది. అధర్మమడచి ధర్మస్థాపనచేయుటకే తాను యుగ యుగమును అవతరించెదనని కృష్ణుగీతలలో చెప్పియున్నాడు. అట్లే అధర్మ ప్రాబల్యము నడచి తాను అంతర్హితుడైనాడు. కారణ జన్ముడై, ధర్మ సంస్థాపకుడై, పతితపావనుడై, నిత్యానంద స్వరూపుడగు శ్రీరాధాకృష్ణుడు తన జన్మచే దేశము పునీతముజేసెను. అటు పిమ్మట దేశచరిత్ర విషయము మన కక్కరలేదు. శ్రీకృష్ణుని సంబంధమున్నంతవరకే మనము విచారించినాము. అది ఆయన నిర్యాణముతో ముగిసినది.

బా:- అమ్మా! చక్కగా జ్ఞాపకము చేసినావు. రాధాకృష్ణుడు దేశము పునీతము చేసినట్లు జెప్పినావే! రాధాకృష్ణుడెవరు? రాధ యెవరు - ఆయనకు రాధాకృష్ణ నామమెట్లు వచ్చినది? రాధ ఆయనకు భార్యయేనా?

తల్లి:- ఆ సంగతి రేపు చెప్పెదను - మీ నాన్నగారు వచ్చుచున్నారు.

తండ్రి వచ్చి "నేను లేకుండానే పురాణము జరిగిందా?"

పిల్లలు రాధ యెవరో చెప్పమ్మా అని గోలచేసినారు.

తండ్రి "రాధ శ్రీకృష్ణుని మేనత్త కాదుటరా" అనెను.

"ఆ విషయమై రేపు చెప్పుకుందాములే! భోజనాలకు పదండి" అని లేచి తల్లి వెళ్లెను.

తండ్రి:- రాధ విషయమై నాకు కొన్ని సందేహాలున్నవిరా.

పిల్లవాడు:- ఆ విషయము రేపు అమ్మను గట్టిగా కనుక్కుందాములే నాన్నా.

(సశేషము)




# తావీదు తమాషా

శ్రీ చంద్రశేఖర్

ఆ రోజు నందగోపాల్ తను చదువుకొన్నప్పుడు వ్రాసేసిననోట్సులు, యింకా యింటిలోవున్న చిత్తు కాగితాలు అమ్మి సినిమాకెళ్ళడానికి ప్రోగ్రాం వేసాడు. అన్నీ పోగుచేసెప్పటికి అరవీశకి అరపంపు తక్కువయ్యాయి. అవమ్మితే ఒకళ్ళు వెళ్ళడానికి కూడా సరిపోయే డబ్బులురావు. కాసేపు ఆలోచించి అతను చెల్లెళ్ళు దాచుకొన్న చిత్తునోట్సులకి వేసాడు ప్లాను: తిన్నగా యింట్లోకివెళ్ళి లలితతో "ఏమే లలితా! మీ చిత్తు నోట్సులు యిలాపడెయ్యవే అమ్మేస్తా" అన్నాడు. "మేమే అమ్ముకొంటాంలే. ఆశ్రమనీకెందుకులేవోయ్" అన్నారు ఎత్తుపైఎత్తుగా. కాని 'నందగోపాల్ మహాపట్టుదల గలవాడులెండి, "అది కాదే లలితా! మీ కాగితాల్లో నాకేం వాటా యివ్వక్కర్లేదులే, ఎలాగ నా కాగితాలు అమ్ముతున్నాగదా; పనిలోపనని అడుగుతున్నా అంతే!" అన్నాడు ఎంతో నమ్మకంగా. అంతట్లో వాళ్ళమ్మవచ్చి "ఏంట్రా గొడవ, అబ్బబ్బ! ఒక్కనిమిషం వూరుకోవుగదా - వాళ్ళ జోలికి పోవద్దురాంటే మానవుగా" అంది అదేదో దెబ్బలాట అనుకొని. దాంతో గోపాల్ బుద్ధిగల బుద్ధుడులా జరిగిందంతా విన్నవించాడు. దాంతో వాళ్ళమ్మ అందర్నీ సమాధానపరిచేలా చేసి లలితా వాళ్ళకాగితాలుకూడా అమ్మెయ్యడానికి ఒప్పందపరిచింది. మొత్తంమీద ఎట్లాగయితే ఆరోజు నందగోపాల్ ముప్పావలాకి యజమానయ్యాడు.

దాంతో నందగోపాలు పీపాంత ఉబ్బిపోయాడు సంతోషంతో. ఇంటికి వెళుతోంటే ఓచోట జనం గుంపుగావున్నారు. జనాని తోసుకొని ముందుకు వెళ్ళాడు. అక్కడ ఒకడు పడుకొనివున్నాడు. వాడి మొఖం తువాలాతో కప్పివుంది. ఓ గారడి ఓ చిన్న పెట్టిలోనుంచి తావీదులుతీసి చేతిలో పట్టుకొని, "బిడ్డా! ఓ బిడ్డా!" అని కేకేసాడు కాని పడుకొన్నవాడు పలకలేదు. గారడీవాడు చేతిలో తావీదులు కుర్రవాడిమీద పెట్టి తిరిగి పిలిచాడు. ఈసారి పలికాడు. గారడీవాడు జనంవైపుచూచి ఏవేవో ప్రశ్నలు అడిగాడు. వాటన్నింటికి కుర్రవాడు సరియైన సమాధానం చెప్పాడు. జనం ఒకవిధమైన ఆశ్చర్యంగా చూడటం మొదలు పెట్టారు. అవ్యక్తి జనంవైపుతిరిగి "సోదరులారా! యిది మెస్మరిజం గాదు, కనికట్టుగాదు, కాని యిదొక దివ్యమైన మంత్రంతో తయారుచేసిన ప్రసిద్ధ తాయెత్తు, భాయీయో! ఈ తావీదు కింతా అంతా విలువలేదు. ఇసిపాము, తేలు మొదలైన విషజంతువు కాట్లకు పనిచేస్తుంది. గాలి, ధూళి సోకినా, వదిలిస్తుంది. పరీక్షలో గాని, వ్యాపారంలో గాని ఉద్యోగంలోగాని జయం కలిగిస్తుంది. దీనికి, ఎక్కువఖర్చుకూడ గాదు; కాని ఒక్కవిషయం దీన్ని యింటికిభద్రంగా తీసికెళ్ళి సాంబ్రాణి ధూపం వేసి మగవాడైతే దండకి, ఆడవాళ్ళయితే మెళ్ళో కట్టుకొంటే ఎటువంటి కష్టాలురావు. దీని ఖరీదంతో

లేదు. పరమాత్మ సేవచేసే మా గురువుగారి ఆజ్ఞ ప్రకారం ఈ "తావీదు" మహిమ ప్రచారంచేసి ఈ బిడ్డలకష్టాలు తీర్చమని, అందరికి అందుబాటులో ఉండేవిధంగా అర్ధరూపాయి వసూలు చేయ మన్నాడు. కావలసినవారు చేతులు జాపండి. పిల్ల వాడ్ని లేపానంటే మళ్ళీయివ్వను" అంటూ ఓ చిన్న ఉపన్యాసం దంచే సరికి జనంలోనుంచి ఓ డజను చేతులుముందుకు సాగినై. అందులో మావాడి చెయ్యి కూడాలెక్కలో పడింది. ఎలాగైతేనేం ఒకటికొని "పాతాళభైరవి" దొరికినంత ఆనందంతో యింటికి బయలుదేరాడు. దారిలో రావ్ కనపడితే వాడ్ని వెంటబెట్టుకొని యింటికి వెళ్ళి వాడ్ని మంచంమీద పడుకోబెట్టి గారడీవాడు చేసిందంతా చేశాడుకాని ఒక్కటి జరగలేదు. అనిగాక మరోరోజు సినిమా నుంచివస్తుంటే యింజక్షన్‌లా యిచ్చింది "గోడ మీద బొమ్మ, గొలుసులబొమ్మ, వచ్చే పోయేవార్ని వడ్డించేబొమ్మ" ఒక్కసారి దండతనుకున్నాడు. జాగ్రత్తగానే ఉంది. అదైపోయింది. ఆ సంవత్సరం పరీక్షకూడా చెట్టెక్కింది. ఇకవాడికి ఎక్కడలేని ఉక్కురోషంవచ్చి తావీదు తెంపి అవతల గిరా వాటువేశాడు. అప్పట్నుంచి యిప్పటివరకు "తావీదు" మాటెత్తితే తారామండలంగా మండుతాడు — బాలలూ! అటువంటివి నమ్మి మోస పోకండేం?

---

# వీరబల్ వినోదాలు

వీరబల్‌ను ఒకసారి పరాయి రాజొకడు ఆహ్వానించేడు. విందుపూర్తి ఐనతర్వాత తాంబూలాలు వేసుకుంటూండగా ఆ రాజుగారి మంత్రి 'వీరబల్! మారాజుగారి కీర్తి ఎటువంటిది? మీ పాదుషావారికీర్తి ఎటువంటిది? అని ప్రశ్నించేడు. 'మీ రాజుగారిది పున్నమ చంద్రునివంటికీర్తి. మా పాదూషావారిది అమావాస్య చంద్రునివంటిది' అన్నాడు వీరబల్. అంద రూసంతోషించేరు. ఆ రాజు ఎన్నోకానుక లిచ్చి వీరబల్‌ని సత్కరించేడు.

కొన్నాళ్ళయ్యాక ఈ మాట అక్బర్‌కి ఎల్లాగో తెలిసిపోయింది. అక్బరు మండి పడుతూ వీరబల్‌ని పిలిపించి అడిగేడు.

వీరబల్ "ప్రభూ! అన్నమాట నిజమే! కాని అది మిమ్ముదూషించినదికాదే! మీది అమావాస్య చంద్రునివంటికాంతి. అమావాస్య చంద్రునికాంతి రోజురోజుకి ఎక్కువవుతుందికాబట్టి మీ కీర్తివృద్ధి పొందుతుంది! ఇందులో ఏం తప్పుంది? పున్నమ చంద్రునికాంతి క్షీణిస్తుందికాబట్టి అతని కీర్తి క్షీణిస్తుంది" అన్నాడు యుక్తిగా.

ఈ మాటలు విని అక్బర్ ఎంతో సంతోషించేడు.

బాలలూ!

ఎవరిదగ్గర ఎలా మాట్లాడాలో తెలిసి వుండాలి. అందరిచేత మంచి అనిపించుకోవాలి.

పిల్లా సుబ్బారావ్



# స్వామినాథన్

మూలం :
శ్రీ ఆర్. కె. నారాయణ్

స్వేచ్ఛానువాదం :
శ్రీ చీమలపాటి సూర్యనారాయణ

(గతసంచిక తరువాయి)

[.. స్వామి, రాజు, మణులు స్థాపించిన క్రికెటు టీముకు కాప్టెన్‌గా రాజం బంతులకు బాట్లకుగాను వ్రాసిన జాబుకు ఆ కంపెనీవారు వ్రాసిన జాబు నర్థము చేసికొనలేక దానిని తిరిగి పంపిస్తూ కోరినవస్తువులను వెంటనే పంపవలసినదిగా వ్రాశాడు.

స్వామి బౌలర్‌గా రాణించడానికి అవసరమయిన ప్రాక్టీసు లేదని స్నేహితులు విసుగుకోగా స్కూలులో డ్రిల్లుక్లాసునుండి విముక్తుడు కావడానికి అనుమతి కొరకు హెడ్మాష్టరును రాజంచేత అడిగించాడు. కాని హెడ్మాష్టరు కసిరి పంపేసాడు. డాక్టరు దగ్గరకువెళ్లి జబ్బుగానున్నదని సర్టిఫికేటును పొంది డ్రిల్లుక్లాసుకు ఎగవెయ్యాలని ప్రయత్నించాడు కాని డాక్టరు తప్పుడు సర్టిఫికేట్లు యివ్వనని తాను 5 గం.ల కంతా స్వామిని క్లాసునుండి పంపించేటట్లు హెడ్మాష్టరుతో మాట్లాడతానన్నారు. డాక్టరుగారు మాట్లాడతారనే ధైర్యంతో క్లాసుకు పోవడం మానేయగానే హెడ్మాష్టరు జాగ్రఫీక్లాసుకువచ్చి బెత్తంతో కొట్టబోగా స్వామి పారిపోయాడు - యికచదవండి]

మాల్గుడిలో - మరి స్కూళ్లులేవు ... యింతలో స్కూలు గంట మ్రోగింది! తనక్కడున్నట్లయితే నలుగురు విద్యార్థులు తన చుట్టూ మూగి, హేళన చేస్తారన్న కారణంచాత, అక్కడనుండి స్వామిలేచి వెళ్ళిపోయాడు!

తనిదివరకు చదివిన పాత స్కూలును స్వామి చూడగానే, పూర్వపు రోజులు, తనాస్కూల్లో గడిపిన జీవితమంతా జ్ఞాపకం రాసాగింది. రాజం, మణి, బతానిగింజ మొదలగు తన స్నేహితులా స్కూల్లో యెంత స్వేచ్ఛను, ఆనందమును అనుభవిస్తున్నదీ జ్ఞప్తికి దెచ్చుకుని, వేదనపడసాగాడు!

ఈ సంగతి తెల్సిన తన తండ్రి యింటికి మాత్రం చేరనివ్వరు, ఇది వాస్తవమే. పోనీ మరొక బడిలో ప్రవేశిద్దామంటే, మాల్గుడిలో మరి బడులు లేవు. అందుకు - ఏ మద్రాసువంటి ఏ నగరమో పోయి, పని చేసుకుని బ్రతకడం మంచిదనుకొని ఒక స్థిర నిశ్చయానికి స్వామి వచ్చేసాడు. అయితే - తాను పోయే ముందర రాజమ్ను చూడాలనుకున్నాడు!

స్వామి మెయిన్ గేటులోనుంచి వెళ్ళక చుట్టూ తిరిగి స్కూల్లో ప్రవేశించాడు. ఆ ప్రదేశమంతా క్రొత్తగా స్వామి దృష్టికి గోచరించింది.

చాలా కాలంవరకు ఎవరైనా కనబడతారేమోనని

స్వామి వేచియున్నా యెవరూ బయటకు రాలేదు. యింతలో వృష్మ్యనిమిత్తం ఒకటవఫారంనుండియెవరో చిన్న కుర్రవాడు బయటకొచ్చి, స్వామి దృష్టిలో పడ్డాడు!

స్వామి, చిన్నగా యీల వూదాడు. కాని వాడికి మాత్రం వినిపించటంలేదు. రెండవమారు యీలవెయ్యగానే, ఆకుర్రాడు స్వామివయిపు చూశాడు. స్వామి రమ్మనమన్నట్టు చెయ్యూపాడు. వెళ్ళడమా, లేక క్లాసుకు పోవడమా అని ఆకుర్రాడాలోచిస్తున్న సమయంలో స్వామి మరల పిల్వడంచాత, ఆకుర్రాడు స్వామి దగ్గరకు వెళ్లాడు!

అసలు విషయాన్ని మరుగు పరుస్తూ.—

"నీకు పిప్పరమెంట్లు కావాలా?" అని స్వామి ప్రశ్నించాడు. కావాలన్నట్లు తలూపాడు.

"అయితే, పిప్పరమెంట్లు నీకిప్పుడియ్యను; నువ్వు రెండవఫారం ఏ. తరగతికిపోయి, ఎం. రాజం అనే కుర్రవానితో - నీగురించి మీ యింటినుండి బంధువులెవరో వచ్చారనిచెప్పి, నా దగ్గరకు తీసుకువస్తే, నీకు పిప్పరమెంటిస్తాను!" అన్నాడు.

"రెండవఫారం యెక్కడుంది?"

"మేడమీద!"

"ఓఁ!" అంటూ, దేని గురించో ఆకుర్రాడాలోచింపసాగాడు.

"ఏమంటావయ్యా! నేను పది అంకెలు లెఖ పెట్టేలోపుగా నీసమాధానం యేమిటో చెప్పాలి. లేకపోతే, నీకు చెయ్యబోయే ఆఫరు రద్దుపర్చబడుతుంది. ఒకటి - రెండు - మూఁడు—" అని స్వామి లెఖపెట్టసాగాడు!

"మేడమీదనికదూ చెప్పావు?" అని అడిగాడు.

"అవును!"

"కానీ - నేనెప్పుడూ అక్కడకు వెళ్ళలేదే!"

"పోనీ - యిప్పుడు వెళతావుగా!"

"నాకు దారి తెలీదు!"

"అబ్బే, దారి తెలియకపోవడానికేముంది? మెట్లెక్కి వెళ్ళడమే!"

"నేనక్కడకు వెళితే, వాళ్లు-వాళ్లు-నన్ను కొట్టరుఁగఁదా?"

"ఈ అనవసర ప్రస్తాపనంతా యెందుకు చేఁబుదూ? యింతకీ వెళ్ళే వుద్దేశం నీకుందా లేదా?"

"సరే, యిక్కడేవుండు!" అంటూ, ఆ కుర్రవాఁడు తుర్రుమన్నాడు!

పదినిముషముల తరువాత, రాజమ్‌ను వెంటఁబెట్టుఁకునివచ్చాఁడు! స్వామిని చూడఁగానే రాజమ్ నిశ్చేష్టుడైపోయాఁడు!

"ఇక్కడేం చేస్తున్నావయ్యా?" రాజమ్ స్వామిని అడిగాఁడు.

"గోడను వేగిరంగా గెంతిరా! నీతో కొన్ని సంగతులు మాట్లాడాలి! ... వేగిరం ... ఊఁ!" అని తొందరచేయసాగాఁడు!

"నాకు క్లాసుంది. యిప్పుడు రాలేను!"

"అసభ్య ప్రస్తాపన చెయ్యకు. చెప్పినట్లుచెయ్! నీతో అవసరమైన భోగట్టా చెప్పాలి ... గమ్మున రావయ్యా!" అని స్వామి, రాజమ్‌ను హెచ్చరించాడు!

రాజమ్.గోడగెంతి స్వామి ప్రక్కన నిలువబడ్డాడు! ఆ పొట్టి కుర్రాడికి మాత్రం స్వామి శిరస్సు కన్పించటంలేఁదు. ఆ కారణంచాత.—

"ఏయ్, పిప్పరమెంట్లు యిస్తానన్నావ్, యేవీ?" అని అరవసాగాడు.

"అరే, పొట్టి బుడంకాయా! నిన్ను మరిచేపోయాన్ర!! యిలావచ్చి, యిది పట్టుఁగో!" అంటూ స్వామి, ఒక కాణీ నాణెమును విసిరాడు.

"నాకు ఆల్మండ్ పిప్పరమెంటిస్తానంటివే?" అని నిలఁదీసి అడిగాఁడు!"

"సరే యిస్తానన్నానుకో ... యీ కాణీతో పిప్పరమెంట్లు కొనుక్కో!"

"నువ్వు రెండిస్తానన్నావ్?"

"పోవయ్యా, నాతో బేరం ఆడకు. బేరాలు సాగించేందుకిది మార్కెట్టుకాదు!" అంటూ రాయిమీదనుంచి గెంతి రాజమ్ దగ్గరకు వచ్చాఁడు.

(సశేషం)

# వెంట్రుకలు పెరుగుటకు, నలుపెక్కుటకు చికిత్సలు

శ్రీమతి చివుకుల లక్ష్మీ పున్నయ్య

వెంట్రుకలు పెరుగుటకు, నల్లబడచేయుటకు కొబ్బరినూనె వాడకం చాలమంచిది.

రేగు చెట్టుయొక్క ఆకులు నూరి, తలకు రుద్దుకొని స్నానము చేయుచుండినచో వెంట్రుక లెదుగును.

ఆలివునూనెలో కాని, కొబ్బరినూనెలో కాని సమానంగా మందార పుష్పముల రసంకలిపి పొయ్యిమీదనుంచి నీరు యిగురువరకు కాచి తలకు పూసుకొనుచుండినచో వెంట్రుక లెదుగును.

మల్లిపూలధారణ వెంట్రుకల పెరుగుదలకు మేలుచేయును.

నీలిమందును నూనెలో కలిపి పూసుకొనుచుండిన వెంట్రుక లెదుగును.

కోలపాలకూర వెంట్రుకలు నెరియడమును పోగొట్టును.

జీడిగింజలను నువ్వుల నూనెలో వేసి కాచి తలకు పూసుకొనినచో వెంట్రుకలు నలుపెక్కును; బలము చేకూరును. అంతేకాక తలలోని పేలను సయితము చంపును.

సీకాయ చెట్టు యొక్క కాయల పులుసుతో వెంట్రుకలకు మృదుత్వము అబ్బి, బలముచేకూరును.

---



---




శ్రీ పొట్టి శ్రీరాములుగారి ఆమరణ నిరాహార దీక్షకు సంబంధించిన వివరములు, విశేషములు ఆంగ్లభాషలో పొందుపరచబడిన పుస్తకము మా కార్యాలయమునకు చేరినది. సంపాదకుడు, ప్రచురణకర్త: డాక్టరు శ్రీ కస్తూరి నారాయణమూర్తిగారు, మైలాపూరు, మద్రాసు. వెల రు 1-0-0.

ఈ పుస్తకంలో సంపాదకుడు పాఠకులకు అత్యంత ఆసక్తిని, విజ్ఞాన వికాసములను కలిగించే అనేక విషయాలను, వైద్య, ఆరోగ్య, చారిత్రాత్మిక, మానసిక, ఆధ్యాత్మిక వెలుగులలో వివరించారు.

శ్రీ శ్రీరాములుగారి సూచనల ననుసరించి నిరాహారదీక్షా సమయమున అత్యంత సన్నిహితముగానుండి పరీక్ష చేయుచు, దైనందిన సపర్యల నేర్పాటుచేసిన వైద్యులసంఘములో ప్రధానపాత్ర నిర్వహించినవారు శ్రీ నారాయణమూర్తిగారు.

సుప్రసిద్ధులు, అపారమైన అనుభవముగల వైద్యులు కాబట్టి సంపాదకులు వైద్యశాస్త్రమునకు, ఆరోగ్య శాస్త్రమునకు నిరాహార దీక్షకుగల సంబంధములను పరిణామములను పరిశోధనా పూర్వకంగా వివరిస్తూ "మనుష్యుడంటే మాంసపుముద్ద అనడంకంటె ఆత్మ ప్రాధానమయినది"గా నిరూపించారు. వీరి యీ కృషి మనదేశంలోనే కాకుండా విదేశాలలో పయితం నిరశన వ్రతాలకు సంబంధించిన విషయాల యెడల ఆసక్తిని ప్రబలచేయగలదు.

సత్యాన్వేషణము : శ్రీ శోభనరావు. ప్రచురణకర్తలు : నాస్తిక ప్రచురణాలయము, పటమట, (వయా) విజయవాడ. వెల రు 1-4-0.

ఇది నాస్తిక వాదాన్ని ప్రచారముచేయుటకని ఉద్దేశించిన నాటకము. ఈ తత్వాన్ని బలపరచడానికిగాను సంఘంలోని ప్రస్తుతపు అవకతవకలు, కులతత్వాలు, సూధనమ్మకాలు మొదలగువానిని చిత్రిస్తూ యిట్టి లోపాలు లేకుండా కుల, మత, వర్గరహితమయిన సంఘ నిర్మాణము జరిగిననాడుగాని సంఘశ్రేయస్సు సమకూరదనియు, అది నాస్తికతత్వంద్వారానే సాధ్యముకాగలదని యీ నాటకం నిరూపిస్తున్నది.

గ్రంథకర్త పండితులు కాబట్టి రచనానైపుణ్యమునకు కొరతయుండదు. గ్రంథకర్త తన పాండిత్యముతో బాటు ప్రత్యక్షానుభవములతో ఆస్తిక నాస్తిక భావములను పోల్చిచూచి తుదకు నాస్తికవాదిగా మారారట. ఈ గ్రంథ రచనలోని ఉద్దేశము నాస్తిక దృక్పథ ప్రయోజనమును ప్రజల నిత్యసమస్యలలో నిరూపించడమే.

ఈ గ్రంథము పాఠకులను ఆలోచింపజేస్తుంది. కాని నాస్తికవాదము సంఘములోని లోపాలను దిద్దడానికంటె సంఘశ్రేయస్సుకు అవసరమైన కట్టుబాట్లు, క్రమశిక్షణ, నీతి, నియమాలు దెబ్బతింటవని అనేకుల అభిప్రాయం. అట్టి పరిణామాలు వాంఛనీయమైనవికావు కాబట్టి సాంఘిక, జాతీయ పురోభివృద్ధికి యీ నాటకం ఉపయోగపడితే సంతోషిస్తాను.

ఆనా కెరినినా : (మూలం : టాల్‌స్టాయి) అనువాదం : శ్రీ తాపీ ధర్మారావు గారు. ప్రచురణకర్తలు : ఇంటింటి విజ్ఞానమాల, 16 జోన్సువీధి, మద్రాసు 1. వెల రు 6-0-0.

టాల్‌స్టాయి ప్రపంచ సాహిత్యంలో ప్రముఖుడు. ఆయన రచించిన 'అనెకెరినినా'ను తెలుగు దేశంలో సుప్రసిద్ధ రచయితలైన శ్రీ తాపీ ధర్మారావుగారు అనువదించి ఇంటింటి విజ్ఞానమాలవారి ద్వారా ఆంధ్ర ప్రజానీకానికి అందజేయడం సంతోషింపతగిన విషయం.

టాల్‌స్టాయి రచనలు ప్రతియొక్కటి సంఘంలోని దైనందిన సమస్యలకు సంబంధించినది. అందులో మహోత్తమ స్థానాన్ని అలంకరించిన నవలలోనిది యొకటి. ఆయన రచనలలో ఏదో వ్యక్తిని, ఏదో సంఘటనను, ఏదో కుటుంబాన్ని ఆధారం చేసికొని మానవులలో నూతనజాగృతిని, సన్నసత్యపరిశీలనను మేల్కొలిపాడు. దాంతోపాటు ప్రతిమానవుడు నలుగురితోపాటు ప్రధానవసరాలైనా గడుస్తూ సుఖంగా కాలక్షేపం చెయ్యడానికి హక్కు, అవకాశములున్నవని ప్రబోధించడానికి శతవిధాల ప్రయత్నిస్తాడు.

ఈ సుప్రసిద్ధ రచయిత భూతదయ, కేవలం బాధితులకు, దరిద్రులకు మాత్రము చెందినదికాక మహర్దశ పురుషులకుకూడ నన్వయించును.

నిస్పృహ నిరాశలతో పతనావస్థలోనున్న ప్రజానీకానికి 'అనెకెరినినా' లాంటి టాల్‌స్టాయి ఉత్తమ రచనలు 'మీయొక్క భవిష్యత్తు పురోభివృద్ధి మీ చేతుల్లోనే యున్నది; ముందుకు నడువండి!' అని ప్రబోధించి ప్రోత్సహిస్తుంది.

సాంఘిక, వ్యవసాయక వ్యవస్థలలో ఆనాటి రష్యాకు, యీనాటి మనదేశపు పరిస్థితులకు కొన్ని సామ్యములున్నవి. కాబట్టి అన్ని రంగాలలోను పురోభివృద్ధి సాధనకు 'అనెకెరినినా' గ్రంథంతోపాటు వారి యితర రచనలు నయితం మనదేశ ప్రజానీకానికి విశేషంగా నుపకరించగలవు.

శ్రీ ధర్మారావుగారి అనువాదం బహుపొందికగాను, సరళంగానుండి మూలంయొక్క రసస్వభావాలు చక్కగా పోషింపబడియున్నవి. ఆంధ్రదేశంలో ప్రతివారు చదవదగిన గ్రంథమిది.

పండుగ బహుమానము : శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి. ప్రకాశకులు : ఆంధ్ర బుక్‌హౌస్, హైదరాబాద్ (దక్కన్) వెల రు 2-0-0.

ఇందులో 14 కథలున్నవి. వీనిలో కొన్ని యిదివరకే భారతి, గృహలక్ష్మి, తెలుగుతల్లి మొదలగు పత్రికలలో వెలువడినవి. మరికొన్ని హైదరాబాద్ రేడియోలో ప్రసారితమయినవి.

ఈ కథలు చిన్నవిగను, సరళమైన భాషాశైలితో చదువరులను అడుగడుగుకు ఉత్సాహపరచుచుండును. దాంతోపాటు వినోద, విజ్ఞానములను సమకూర్చునవిగాకూడ నున్నవి.

ఈ గ్రంథము పఠించిన తరువాత రచయిత్రి కథారచనలో చేసిన పరిశ్రమ, చూపిన ఆసక్తి తెలియగలదు.

కథావాఙ్మయంలో విశేషంగా శ్రద్ధ చూపుచున్న పాఠకులను యీ కథల సంపుటి విశేషంగా ఆకర్షించగలదు.

# సంపాదకీయములు

## లలితకళల అభివృద్ధి

ఈ సంవత్సరపు ఆఖరులోగా లలితకళా అకాడమీ నిర్మించబడగలదని కేంద్రవిద్యాశాఖ కార్యదర్శి ప్రకటించారు. ఈ అకాడమీ కళాశీలురచేతనే నడుపుకోగలదని, కళను, కళాశీలురను ప్రోత్సహించడంలో ప్రభుత్వానికి యీ సంస్థ సలహాలివ్వగలదట. ఈ అకాడమీయొక్క ప్రాముఖ్యమును ప్రజలు సులభంగా గుర్తించగలరని మా నమ్మకం.

దీనితోబాటు కళాపిపాస, కళారాధన ప్రజాసామాన్యంలో తీవ్రగతిన వ్యాప్తి చెందాలి. అందుకుగాను దేశవ్యాప్తంగా ఆరితేరిన కళాకారుల యాజమాన్యమున ఉత్తమ సాంప్రదాయాలను, నియమబద్ధంగా ప్రజలలో ఆధునిక అభిరుచులకు అనుగుణ్యంగా, విశిష్టతకు భంగముకలుగని పద్ధతులలో కళా కేంద్రాలు నిర్వహించబడాలి. ఈ కళా కేంద్రాల కృషిఫలితంగా ప్రజలలో వినోదము, విజ్ఞానము, సంస్కృతి మొదలగు వానికి సంబంధించిన అభిరుచులు పెంపొందాలి. ఆ నాడు అన్నిటితో బాటు లలితకళలు అభ్యుదయమార్గంలో ప్రజల పురోభివృద్ధికి తోడ్పడగలవు. ఈ కృషికి అధికార, అనధికార సహాయసహకారములు అత్యంత అవసరము.

## సర్కారు, దత్తమండలాల విభేధాలు

ఇంతవరకు ఎలాగుగా గడచినా స్వరాష్ట్రం ఏర్పడిన పిమ్మటనైనా సర్కారు, దత్తమండలాల విభేధాలు సమసిపోవాలి. వెనుకబడియున్న దత్తమండలాల పురోభివృద్ధి రాష్ట్రమొత్తపు శ్రేయస్సుకు అవసరమను విషయం వివాదరహితమయినది. అందుకు పురోభివృద్ధి దశలోనున్న సర్కారుజిల్లాల వారు రాయలసీమవారిని కలుపుకొని వెనుకబడియున్న ప్రాంత్యాల అభివృద్ధికి ఏకోన్ముఖంగా కృషిచెయ్యాలి.

కర్నూలులో ఏర్పడిన తాత్కాలిక రాజధాని నగరమునుగురించి విమర్శలు, ప్రతివిమర్శలు చాల విచారకరమైనవి. విశాలభావాలతో త్యాగపూరిత దృష్టిగలిగి సమైక్యతతో సర్కారు, రాయలసీమ ప్రజలు ఉమ్మడి సమస్యలను పరిష్కరించుకోవాలని మా హెచ్చరిక.

---



---

# శ్రీ విజయనామ సం॥ర కార్తీక - మార్గశిరమాసములు.

| | | | |
|---|---|---|---|
| 1953 సం॥ నవంబరు నెల | 16 | సో | ద 25 24 పూభా 38-22 శేష ఉ 6-35 కు త్రిగ్రివర్జ్యంలేదు దశమీతిథిః |
| | 17 | మం | ఏ 19-8 ఉభా 33-54 ది 0-35 తిథిద్వయం. సర్వేషాం ఏకాదశి |
| | 18 | బు | ద్వా 12-45 రే 29-0 ది 1-37 వ ఉ 6-45 మొ. క్షీరాబ్ధిద్వాదశి |
| | 19 | గు | త్ర 6-31 అశ్వ 25 7 వప 12-27 మొ 1-56 కు |
| | 20 | శు | చతు 0-38 ఉపం ○ పూ. 55-5 వ 0-38 వరా 1-57 మొ 3-28 కు |
| | 21 | శ | బ. పాడ్యమి. 51-2 వతె 4-43 కృత్తికా దీపోత్సవః |
| | 22 | ఆ | విదియ 48 13 రో 15-42 వ ఉ 6-16 కు |
| | 23 | సో | తదియ 46.18 మృ 14-46 వ రా 8-28 మొ 10-4 కు |
| | 24 | మం | చ 45-33 అ 14-48 వరా 12-22 మొ 2-0 కు |
| | 25 | బు | పం 46.5 పున 16-11 వరా 8-59 మొ 10-39 |
| | 26 | గు | ష 47-30 పుష్య 18-44 వతె 3-15 మొ 4-57 కు |
| | 27 | శు | స 50 29 ఆశ్రే 22-22 వతె 4-3 మొ 5-46 కు |
| | 28 | శ | అ 54-16 మఘ 26-56 వరా 1-40 |
| | 29 | ఆ | న 48-25 పూఫ 32-14 వతె 3-0 మొ 4-45 |
| | 30 | సో | ద 60-10 ఉఫ 37-56 త్యాజ్యాభావః. వర్జంలేదు |
| 1953 సం॥ డిసెంబరు నెల | 1 | మం | ద 3-7 హ 43-56 త్యా 4-24 వ ఉ 6-41 మొ 8-27 కు |
| | 2 | బు | ఏ 7-58 చిత్త 49-49 ది 5-54 వ ఉ 8-38 మొ 10-24 కు |
| | 3 | గు | ద్వా 12-40 స్వా 55-25 త్యా 4-24 వ ఉ 6-41 మొ 8-27 కు |
| | 4 | శు | త్ర 17-3 విశా 60-10 వప 10-33 మొ 12-27 కు |
| | 5 | శ | చతు 20-24 విశా 0-34 ది 11-16 శూన్యతిథిః |
| | 6 | ఆ | ● అమా 22-58 ది 19-34 గోత్రిరాత్రవ్రతం |
| | | | **మా ర్గ శి ర మా స ము** |
| | 7 | సో | శుపాడ్యమి 24-28 జ్యే 7-53 వరా 5-40 మొ 7-20 కు |
| | 8 | మం | విదియ 24-46 మూ 10-1 ది 25-52 వఉ 8-42 మొ 10-22 కు |
| | 9 | బు | తదియా 23-52 పూషా 10-42 వరా 6-33 మొ 8-8 కు |
| | 10 | గు | చ 21-52 ఉషా 10-18 ది 20-2 చతుర్థితిథిః |
| | 11 | శు | పం 18-13 శ్ర 8-43 ది 18-17 తిథిద్వయం. నాగపంచమి |
| | 12 | శ | ష 13-54 ధ 6-8 వప 3-37 మొ 5-7 కు సుబ్రహ్మణ్యషష్టి |
| | 13 | ఆ | స 8-42 శత 2-43 ది 17-35 కాలభైరవాష్టమి |
| | 14 | సో | అ 2-48 ఏప్యా 53-51 వప 2-41 మొ 4-10 కు |
| | 15 | మం | ద 50-16 రే 49-27 వప 8-7 మొ 4-36 కు |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd, 15. Westcott Road, Royapettah, Madras.
Founder-Editor : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.

లోధ్ర

FOR LADIES' HEALTH







KESARI KUTEERAM LTD
ROYAPETTAH MADRAS

ఆడుజన్మను సార్థకపరచే
ఆరోగ్యప్రదాయిని

Lodhra Press, Madras-14.